# రాజశిల్పి

'కళాప్రపూర్ణ'

డాక్టరు. సురగాలి తిమోతి జ్ఞానానంద కవి



# రాజధాని

'కళాప్రపూర్ణ'

డాక్టర్ యస్. టి. జ్ఞానానంధకవి



రసజ్ఞ పబ్లికేషన్సు

కాకినాడ-3

హక్కులు గ్రంథకర్తవి

అక్షయ - సంక్రాంతి

ప్రథమముద్రణ
1000 ప్రతులు

మూల్యము
15 రూ॥లు

ముద్రణ :
శ్రీపతిప్రెస్
కాకినాడ
1987

ప్రతులకు :
డా॥ యస్. టి. జ్ఞానానందకవి
రసజ్ఞపల్లి కేషన్సు
కాకినాడ-3

# ఆహ్వానము

నా కవితాఖండకావ్యరచనాపరంపరలో నిదియొక ఖండ కావ్యము. దీనిపేరు "రాజధాని". ఈ కావ్యమునందలి శీర్షి కలలో రాజధాని శీర్షికయు గలదు. గ్రంథమునకు పేరుపెట్టుటలో నొక యందము చందమునున్నది. కనుకనే యీ గ్రంథమున కీపేరు పెట్టితిని. నేటివఱకు చాల ఖండకావ్యములను వ్రాసితిని. వానిపట్టిక నిందులో చేర్చితిని. అవి కేవల మనేకశీర్షికలుగల గ్రంథములే; వానికి తగినవిధముగనే పేరుపెట్టితిని. అటులనే యీ కావ్యమునకు గూడ పేరుపెట్టితిని.

నేడు పెరుగుచున్న నాగరకతాసమాజమున నక్కఱకురాని వెట్టిమొట్టి వికృతచేష్టలు బాహాటముగా చిందులుత్రొక్కుచుండుట నాగరకతాలోకమునకు విదితమే. ఇదియొక సంస్కృతి. మఱి యిది యొక నాగరకత. ఏది సంస్కృతి ? మఱేది నాగరికత ? యనునది తేల్చుకొనలేని దీనస్థితిలో ప్రజాజీవనము సాగుచున్నది. ప్రజకు జీవి తముసాగుచో చాలును. అందులో నానందమున్నచో నదివారి కతి సమీపమున నున్నచో మఱిదేనిని వారుకోరరు. బ్రతుకనగా కూడు, గుడ్డ, గూడు మఱియొకటి యక్కఱలేదు. వారిబ్రతుకంతయు నంతే, ఈ ప్రజావళిలో మఱియొక వర్గమున్నది. వీరల్పసంఖ్యాకవర్గము. ఇక్కడ అల్పసంఖ్యాకవర్గ మనగా కులముల, మతముల, రాజకీయ ముల సంబంధమైన విషయములుగాదు. ఏది యనిర్వచనీయానందము చేకూర్పగలదో ఏది మానవజాతి మేధాకాశములో నుజ్జ్వలచైతన్య విస్ఫూర్తి విజ్ఞానవికాసదీధితుల మెఱయింపగలదో ఏది దానవత్వము

నుండి దైవత్వమునకు దారి చూపింపగలదో యసంస్కృతినుండి సంస్కృతికి నమానుషత్వమునుండి మానుషత్వమునకు వైషమ్య ములనుండి సౌమ్యమునకు నసమానత్వమునుండి సమానత్వమునకు విలువలపెంచి మానవాళిని క్రాంతిపథములో నడిపించునో దాని నైపు మరలినవారు దానియం దభిమానపడి ప్రాణి జీవనధర్మమని నమ్మెదరో యుజ్జ్వల కవితామార్గము నెన్నుకొందురో వీరల్ప సంఖ్యాకవర్గమే మఱి; వీరందఱు వాల్మీకిని స్తుతింతురు. నన్న య్యను పూజింతురు. ఛందోమార్గమున కంజలింతురు. ఛందములు చాలయున్నవి. వీనిలో ముఖ్యముగా నేడు ఛందములకు ప్రాచుర్య మున్నది. యజ్ఞఋషిఋక్కులలో గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, విరాట్, త్రిష్టుప్, జగతి యనునవి. ఈ యేడింటిలో త్రిష్టుప్ ఛంద మెక్కువగా నుపయోగింపబడినది. తరువాతది గాయత్రి. పిమ్మట జగతి యాపయి అనుష్టుప్. సంస్కృతభాషలో నెక్కువగా ప్రయోగింపబడినది యనుష్టుప్. అత్యంతసౌందర్యసమన్వితమైన తొలికావ్యరచనావివేకి వాల్మీకి రామాయణము గుర్తునకు రాక మానదు. ఇదంతయు నొక మహావిషయము. అది నాటికాలము. ఆనాడు కావ్యము లున్నవి. ఆనాటి ఋగ్వేదఆర్యులకు రమణీయ మైన కవితాశైలి యున్నది. దేవతానీకమును సంతుష్టులనుగా జేయు టయే నాటి ఋషిమూర్ధన్యుల ఋక్కుల కేకైకప్రయోజనము. నాడు మధురములైన జానపదగీతములు వీరగాథ లున్నవి. ఇవి నాటి సమాజ స్పృహ కుద్దీపకములు. నాటి సమాజస్పందన కవ్వియే చైతన్యరచనాదీపికలు. కాలముతోపాటు మానవబుద్ధింద్రియ పాట వములలో మార్పు చెందవలసియున్నది. ఇది తప్పనిసరి.

ఇదియంతయు నెందుకు చెప్పవలసివచ్చినది ? సమాజస్పృహ యనుపేరుతో ప్రతి యుపన్యాసకుడు, రచయిత, కవి, మాటిమాటికి

నుచ్చరించుచున్న శబ్దము లేక నినాదము. అన్నియుగములలోను అన్నిసమాజములలోను నినదించుచున్న శబ్దమేయిది. ఆనాటి యుగ భావకల్పన యది. కాలము ముందునకు సాగుచున్న పరిణామదశలో వివిధములైన స్పందనలు భావనలు కల్పనలు ఆలోచనలుకూడ మారు చుండుట సహజము. ఒకానొకనాడు గీర్వాణభాషాదేవి శిరమెత్తి పాలకులచే ప్రశంసింపబడి పట్టముగట్టుకొన్నయది. తక్కుంగల భాషాలలితాంగులు శిరస్సెత్తుకొనుటకునైన నోము నోచుకొనలేక పోయినవి. కారణము తేలికగా చెప్పుకొనగలము. ఈ యుగధర్మ మును నాటియుగము సహింపదు. నాటి యుగధర్మమును నేటియుగము నిర్మొగమోటముగా నిష్కర్షగా నవలకు నెట్టివేయగలదు. ఇదం తయు కాలవిపరిణామ మనకతప్పదు.

కవితాశారద నేడెన్నియోభంగిమల రూపు దిద్దుకొను చున్నది. ఆలంకారికు లనుమతించిన లక్షణము లెవరికి కావలయును? శబ్దగత అర్థగత మాధుర్యములతో పనియేమి? ఎవరికితోచిన ప్రక్రియాస్వరూపములో శబ్దస్వారస్యము త్యజించి యేవేవో నినాద ములుగా గావుకేకలువెట్టు శబ్దముల నుల్లేఖించుచు నిదియే కవితా మార్గమని దీని నుల్లంఘించిన రచన రచనకాదని వారు ప్రాచీనవాద మునకు ప్రతీకలని నిరసించుటయు గలదు. అట్టివారి కొకనమస్కారము

"నియతీకృత నియమరహితం హ్లాదైకమయీాం అనన్యపరతంత్రం నవరసరుచిరాం నిర్మితిమా దధతీ భారతీకవేః" – మమ్మటుడు.

"రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం" – పండితరాయలు.

"రసాత్మకం వాక్యం కావ్యం" – విశ్వనాథుడు.

అని వాకొనినారు.

కవిత్వము నిస్సీమమైనది. నిర్బంధరహితమైనది. హ్లాదైకమయ మైనది. అనన్యపరతంత్రమైనది. నవరసరుచిరమైనది.

రమణీయార్థమును ప్రతిపాదించునది– కవిత్వము హృదయరంజకమైనది. అనగా హృదయము స్పందింపచేయునది. హృదయమునకు వికాసము గల్గించునది. మనఃప్రపంచమును విస్తృతపఱచునది.

"Poetry has been to me its own exceeding great reward; it has soothed my affections. It has multiplied and refined my enjoyments. It has endeared solitude, and it has given me the habit of wishing to discover the good and beautiful in all that meets and surrounds me.''

కవిత్వమును గుఱించి తన యనుభవమును "కోల్రిడ్జి'' చెప్పిన మాటలు గమనార్హము. కవిభావముతో నేకీభవించు పాఠకుడు అనంతరసప్రపంచములో విలీనమైపోయి యానందమయుడగుటలో సందేహము లేదు. అందుకనే జర్మనుకవి "గెటే'' ఇటు లనును.

''Each age has sung beauty. He who perceives it, is from himself set free.''

కవి తనరచనలో భావప్రకటనము రసమును హెచ్చుగా పోషించుకొలది భాషాప్రాగల్భ్యము అలంకారముల ప్రయోగములపై నాశ తగ్గును. కవిత్వము మఱి నిరలంకృతరసహీనముగ నుండవలయునని గాదు. అందుకనే విశ్వకవి తనగానము గుఱించి యిట్లనెను.

''My song has put off her adornments,
She has no pride of dress or decoration ;
They would come between thee and me ;
Their jingling would drown thy whispers.''

కవి తనరచనలో రసము పండించునటుల చేయుటయే కర్తవ్యము.

విశ్వనాథవా రన్నట్లు–

"కవిప్రతిభలోననుండును కావ్యగతశ
తాంశములయందు తొంబది యైనపాళ్ళు

ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాధృతికిమించి''

కథ చెప్పుటకంటె రసములోనే కవిప్రతిభ యున్నది. విశ్వధర్మమును సాక్షాత్కరింపజేయగలవారు ఋషులు. కవులు ఋషులతో సమానులు. అట్టివారే కావ్యములను వ్రాయవలయును. ఆకావ్యములలో విశ్వమానవకల్యాణము హితప్రబోధము, ఆనందము, రమణీయార్థము ప్రతిపాదింపబడవలయును. కేవలము నాలుగక్షరాలతో వినోదములు చేయునవి గాకూడదు. ముందేచెప్పితిని. కవి సామాన్యుడుకాడని. భావనాశక్తి దర్శకశక్తి కల్పనాసామర్థ్యము వాఙ్నిపుణతి కవి కవసరము. అప్పుడే

"My Pen works miracles" అను

Mir Ali వాక్యములకు గిట్టుబాటు.

సాహిత్యముచు గూర్చియు కవుల గురించియు మరికొన్ని యుదాహరణము లిత్తును. చిత్తగింపుడు.

"Flowers smell sweeter in the works of the poets
Than they do in real garden."

— Philip Sidney.

"The Philosopher teaches by precept done and the Historian by the example alone.
The Poet employs both precept and example"

— Philip Sidney.

"Literature is a reflection of life,
Literature is the manifestation of human emotions
"All good literature has some kind of a liberalising tradition.

Literature is not only a Social Commentary, though it reflects the Society in the best and most honest way.

Literature helps create loyalties against prejudices. It advocates compassion against hatred; it widens horizons and separates one from the narrow class or social distinctions. These elements are vital for all good literature.''

— Suresh Kohli.

''The Poet is concerned with his environment, his people, his situations and the events that take place around him.''

— Robert Frost.

''The 'realistic' writter as one who thinks that truth to observed facts-facts about the outer world or facts about his own feelings- is the great thing, while the 'idealistic' writter wants rather to create a pleasant and edifying picture.''

— G. S. Fraser.

సాహిత్యమున కిన్నియభిప్రాయములు ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసులు నిర్వచించినారు. ప్రక్రియావిధానములు వేఱయినంత మాత్రమున సమాజవికాసమునకు నవి స్పృహాకలిగింపవలయును గదా ! సంప్రదాయమయిన, భావకవిత్వమైన అభ్యుదయ, వచన, విప్లవ, దిగంబర, మినీ. రచనలనునవి మానవమనోవీథిలో మహోజ్జ్వలముగా వెలుగవలసిన కిరణాంశువులే ! సమాజాభ్యుదయమునకు క్రాంతి ఘంటాపథపథకములే !

రాజధానిపేరుగల యొకశీర్షిక యిందున్నదని ముందే తెలిపితిని. దానిపేరే యాకృతికి పెట్టితిని. నా చాలకృతులను తెలుగు పెద్దలకే యంకిత మిచ్చితిని. అంకితమనగా నేమో రసజ్ఞపాఠకలోకమునకు విదితమే. పూర్వము కవుల కృతులను స్వీకరించి యా కవుల జీవితాంతము పోషించిన కృతిభర్త లున్నారు. వారు రాజులే

కావచ్చును, మఱెవ్వరైనను గావచ్చును. అందువలన నాటికవులు నిశ్చింతగ జీవించి కావ్యములను వెలయించినారు. ఉదారులైన ప్రభువులాపని చేసినారు. అది సాహిత్యకవితాసరస్వతికి పట్టాభిషేకము. అంకితముపట్ల వారికున్న మర్యాదలట్టివి. ఒకే కావ్యము వ్రాసిన కవియు నటులే నిశ్చింతగ జీవితయాత్ర సలిపినాడు. పోతన్న విషయము వేఱు. అతడు హాలికుడు. అతడే చెప్పినాడుగదా! కావలసినంత పొలమున్నది. దున్నుకొని బ్రతుకవలయునని గాఢమైనతలంపు గలవాడు. చాలమంది తలంచునట్లు పోతన్న వట్టి పేదవాడుగాదు. తినుటకు తిండి, కట్టుకొనుటకు వస్త్రము, నివసించుటకు నిలయము కలవాడు. భగవంతుని నమ్ముకొనుటయే తనజీవితమునకు పరమావధియని తలంచినాడు. మఱినేడో గొప్పవారే హోదాకలవారే ఉన్నవారే; అంకితములగైకొందురు. ఆకృతికర్త జీవితాంతము ఖేదపడవలసినదే. కనీసము ఆ కవికి జీవనాధారము కల్పింపవలెనన్న తలంపుకూడరాదు. ఇది పైపై మోజులకు భ్రమపడు లోకము. ఆకవి కాదరము లభింపనిచో నేమగునో వివరింపనవసరము లేదు. కవులనుగూర్చి గొప్పలుసెప్పి ప్రశంసావాక్యముల దొర్లింతురు. గుండెలో కారుణ్యరసతరంగములు పొర్లవు. కృతి తేరగాలభించినదన్నయుబలాట మా కృతిభర్తకున్నచో నది మహాపచారము కాగలదు. అంకితము గైకొన్న రసజ్ఞుడు కుహనారసజ్ఞుడు గాకూడదు. జరుగుచున్న తమాషాయిది. ఇందులో నబద్ధము లేదు. కవితను కులములతో కొలువరాదని నేనెన్నడో ఆకాశవాణీద్వారమున వినిపించితిని. ఏకలవ్యుని, కర్ణుని యఖండప్రతిభాసామర్థ్య మేమయినది? ఆభావన చావదు. కులములే లేకపోయినచో స్వార్థపరుల కునికి యెక్కడిది? భగవంతుడా నా దేశమును కటాక్షింపుము.

ఇది పైరవీల యుగము. చంచాలకాలము. సూర్యునిచుట్టు భూమి తిరుగునట్లు పై హోదాలో నున్నవానిచుట్టు తిరుగాడినగాని

యెట్టి బహుమతులు, ఉద్యోగములు రాని సంధికాలము. అందఱు తిరుగలేరు; తిరుగరు. ఆత్మాభిమానము చంపుకొనరు. ప్రతిభామూర్తులయిననేమి, వారికి గోడ చేర్పు లేదు– గోడువిను వాడుండడు. ఇది గ్రుడ్డిలోకము. కులపుజిడ్డు పాకముగల శోకభువనము. కులముపేరుననో యాశ్రయించినాడనియో యన్నవారికి రానివేమి ? ఈచైతన్యస్పృహ కోరుచున్న సమాజములో బ్రతుకవలెనన్న కులము ధనము కావలయును. ప్రతిభకు స్థానము శూన్యము. ఇవి చిక్కుతెమల్పని ప్రశ్నములు. ఏవంక బైనాక్యులర్‌తో తిలకించినను సమాజములో నన్నివంకలు నసర్థములే కాన్పించుచున్నవి. మంచి యెక్కడో సుదూరములో బైనాక్యులర్‌కి యందని దూరములో చోటుచేసికొని జీవించుచున్నది.

సాహిత్యవిమర్శకులు తమ చిత్తమువచ్చినట్లు విమర్శలు చేతురు. ఈ తెలుగుసాహిత్యములో సరియైన విమర్శకులు లేరని యెవరోయనిరి. అది నిజమేమోమరి; కాదు నిజమే. ఒక గ్రంథమును విమర్శించునపుడు ఆ గ్రంథకర్త పేరేమి ? అతని కులమేమి ? ఇవి ప్రశ్నలు. అయినచో నా విమర్శకాగ్రేసరుడు రాగద్వేషముల కతీతుడు కాలేదని యనవచ్చును. గ్రంథమున్నది– ఆ గ్రంథములోని యొకభావము తమకు నచ్చనిచో నా గ్రంథమంతయు నిరర్థకమని చాటుటయే వారికి పనిగానున్నట్లు తోచును.

"………సత్కవులు చెప్పిన పద్యములన్ రసంబు పే
రాసగ్రహింప లేక తమయజ్ఞత బైటకుబెట్టు కైవడిన్
దోసములేనిచోటులను దోసములున్నవటంచు పల్కుచున్
దోసము లున్నచోటులను దోసములేదని సంతసించుచున్
హాసము చేసినంత సరియౌనె ? మహాకవితావివేచనా
భ్యాసమనంగ నంత పయిపై బడియున్నదె ?" యని అధిక్షేపించినారు అద్యతనాంధ్రకవి ప్రపంచనిర్మాతలు తిరుపతి వేంకటకవులు.

నన్నయగారు కూడ

"సారమతిన్ గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో
నారసి" అనిరి.

కవిని విమర్శించువారు కవులే కావలయును గాని నాలుగు పొల్లుమాటలనునేర్చి యొకవర్గము నారాధించువారు మాత్రము కారని చెప్పవచ్చును.

" To Judge o f poets is only the faculty of poets not
all poets the best."

— Ben Johnson.

కువిమర్శకులను నిరసించుట ప్రతియుగమునం దున్నదే; నన్నెచోడుడు సంకుసాల నృసింహకవి కువిమర్శకులను నిరసించినారు.

ఒక కవియొక్క కావ్యమును చదువ్రులకు సానుభూతి కావలయును. రెండవది బహువిషయములను సంయోజనపరచుకొనవలయునని విశ్వనాథవా రన్నారు.

మొత్తముమీద సర్వవాఙ్మయమునకు విశ్వశ్రేయమే చరమలక్ష్యము. కవికి సాధ్యము రసము. కావ్యమునకు సాధ్యము విశ్వశ్రేయస్సు.

ఈ రాజధాని కృతిని సాహితీప్రియులును, కవికులాలంకారులునైన మిత్రులు శ్రీ జూపూడి అమ్మలయ్య (అమూల్యశ్రీ) గారికి నంకితమిచ్చితిని.

రాజధాన్యావిష్కారమహోదయభాగ్యమునకు దోహదము గావించిన తెలుగువిశ్వవిద్యాలయమునకు, ఏతత్కులపతులు సాహితీవేత్తలు డా॥ తూమాటి దోణప్పగారికి నా శతసహస్రనమస్కృతులు.

ఈ కావ్యమునకు ముఖపత్రము వ్రాసిన చిరంజీవి వింజరపు వీరసాయికి (వీరు నామిత్రులు చిత్రకళావిశారదులు శ్రీ వింజరపు సుబ్బారావు గారి పుత్రులు) అభినందనలు. చక్కగా మిక్కిలి మక్కువతో నీ గ్రంథమును ముద్రింపించిన శ్రీపతి ప్రెస్ అధినేత శ్రీ తోట గణేశ్వరరావుగారికి జోతలు.

చివరగా "ఎమియల్" (స్విట్జర్లాండు) హెచ్చరిక వాక్యములతో ముగింతును.

" Let us be true; this is the highest
Maxim of art and life,
The secret of eloquence and of
Virtue, and of all moral authority."

కాకినాడ,
15-1-1987.

సురగాలి తిమోతి జ్ఞానానందకవి.



# కృతజ్ఞత

శ్రీకారముతో శుభమని
నా కవితాంజలి ఘటించి నాదగు పేర్మిన్
నీకు కృతజ్ఞత తెల్పెద
గైకొనుమా కూరిమి సురగాలి తిమోతీ !

శౌర్యప్రతాపాలు చాటిచూపినగడ్డ
వీరబొబ్బిలిగన్న పెద్దబిడ్డ
"అక్షరపూజ"లో "అక్షరగుచ్ఛము"
భారతికర్పించు పంతులయ్య
ఘనతకెక్కిన యధికారభాషాసంఘ
సభ్యుండ దొడ్డ సంస్కారహృదుడ
శ్రీక్రీస్తుశతకమ్ము క్రీస్తు ప్రబంధమ్ము
భవ్యగతి రచించు కావ్యకర్త

అమలచరితుండ పద్యవిద్యాప్రభుండ
సంప్రదాయకవిత్వ విశారదుండ
కల్ల లెఱుగని సాహితీవల్లభుండ
కమ్రహృదయ జ్ఞానానందకవివరుండ !

ఆ గండుమీసమ్ము లా నిండురూపమ్ము
నల పాపరాయందు తలపువచ్చు
ఆ పొడవగు లాల్చి ఆ పంచెకట్టును
సాంప్రదాయక రాజసమ్ము తెలుపు
శైలీవిధానమ్ము శబ్దగాంభీర్యమ్ము
కవిసార్వభౌమత్వ ఘనత దెలుపు
ఆమాటలాడుట నా మసలుకొనుట
సౌజన్యసౌశీల్య సరళి తెలుపు

తనకు కల్గినదానితో తనివిసెందు
మానధనుడు సద్గుణసుసంపన్ను డతడు
అచ్చమౌ పదహారణా లాంధ్రు డతడు
ఖ్యాతిగల సురగాలి తిమ్మాతిసుకవి.

దేశవైభవదీప్తి తెల్గుతేజఃకాంతి
నీకవిత్వమ్మున నిగ్గుతేలు
నిరుపేదబాధలు నిమ్నజాతివ్యథల్
నీ కవిత్వమున కన్నీరుగారు
క్రుళ్ళిన కులమత కుటిలవైషమ్యముల్
నీ కవిత్వమ్ములో నిమ్మళించు
సమతాభ్యుదయవాద శాంతిసందేశమ్ము
నీ కవిత్వమ్మున నెగడుచుండు

లోకకల్యాణమాశించి ప్రాకటముగ
కలముచేబూని సాహితీక్షేత్రతలమున
మించు కావ్యరత్నముల పండించుచున్న
సాహితీకృషీవల! కవిసార్వభౌమ!

తెలుపన్ జాలని నిర్మలంబయిన యాత్మీయానురాగాన జ
న్మలపుణ్యమ్మున మిత్రుడైతి మిల జ్ఞానానంద! ధీసాంద్ర! యే
ఫలమాశింపక కావ్యకన్య నిడి యీ భాగ్యంబు గల్పించితో
పలుకన్ సాధ్యమొకో? యుదాత్తగుణభావా! ధర్మమార్గప్రియా!

చక్కని రాజధానికృతి సాదరమొప్పగ నాకునిచ్చి నీ
మక్కువతెల్పి నావిటుల మాన్యచరిత్ర! కళాప్రపూర్ణ! నా
కెక్కడలేనిగౌరవ మదెంతయుగల్గెను ధన్యుడైతి నే
నెక్కడదీర్తు నీఋణ మదెప్పటి దీ యనుబంధ మెంతయున్.

ఘనుడు సంజీవరెడ్డియు ననుపమాన
ప్రథితసాహిత్యవేత్త గోపాలరెడ్డి
ప్రముఖులకు కృతులనొసంగి వరలినట్టి
నీవు నన్ను నావరుసలో నిలిపినావు.

అయ్యదేవర యాశీస్సు లమరియుండ
విశ్వనాథుని కూర్మి దీవెనలుకురియ
జాషువా సాహచర్యమ్ము సంతరింప
ప్రభుకృపన్ స్వయంకృషి నింతవాడవైతి.

ఆమ్రపాలి గోల్కొండాది యనుపమాన
కావ్యముల్ వెలయించిన ఘనతనీది
అట్టికృతులెన్నొ వెలయ వ్రాయందలతు
దైవకృపతోడ నిద్ధాత్రి తనరుమయ్య.

గుంటూరు,
1-1-1987.

కృతజ్ఞతాభినందనాలతో
అమూల్యశ్రీ



# కవి పరిచయము

జననము :

16—7—1922.

అభిజనము :

విజయనగరముజిల్లా, బొబ్బిలి తాలూకా, పెదపెంకి గ్రామము.

తలిదండ్రులు :

శ్రీమతి సురగాలి పాపమ్మ, శ్రీ ఎల్లయ్యగారలు.

వృత్తి :

తెలుగు పండితులు.

ముద్రితకావ్యములు :

తరంగమాల, వసంతగానము, అమరగీత, దేశబంధు అయ్యదేవర కాళేశ్వరరావు, పాంచజన్యము, ప్రభంజనము, పర్జన్యము (రెండు భాగములు), విజయాభిషేకము, అక్షరాభిషేకము, అక్షరాక్షతలు, అక్షరపూజ, అక్షరగుచ్ఛము, గోల్కొండ, ఆమ్రపాలి, పిల్లనగ్రోవి, క్రీస్తు శతకము, క్రీస్తు ప్రబంధము (తొలిభాగము), వెలుగుబాట, క్రీస్తు చరిత్ర (వచనము), హరిజను లంటరానివారా ? (వచనము), నా జీవితగాథ (మొదటి భాగము), రాజధాని.

అముద్రితములు :

నా జీవితగాథ (రెండు, మూడు భాగములు) క్రీస్తు ప్రబంధము (రెండవ భాగము) శింజిని, రెండంకితాలు, అయిదున్నర దశాబ్దాల కవితాపరిశ్రమ, కనకాభిషేక గండపెండారాది సన్మాన సంచిక, అభినందన పద్య, గద్య వ్యాస సంపుటీకరణము.

బిరుదములు :

కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, కవితాశ్రీనాథ, పద్యవిద్యాప్రభువు, మహాకవి, అభినవజాషువ, సాహితీకృషీవల, విద్వత్కవిచూడామణి, సాహితీవల్లభ, కవిలోకవిభూషణ, కవితావిశారద, కవికోకిల, కనకాభిషేక గండపెండారాది సత్కారశాలి.

పూర్వసభ్యులు :

ఎ. పి. లైబ్రరీయాక్టు రివ్యూ కమిటి, తూర్పుగోదావరి జిల్లా గ్రంథాలయసంస్థ, తూర్పుగోదావరిజిల్లా రెడ్ క్రాస్ మానేజింగు కమిటి, తూర్పుగోదావరిజిల్లా పరిషత్తు, ఆంధ్ర విశ్వవిద్యాలయ అకడమిక్ కౌన్సిలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ.

ప్రకృత సభ్యులు :

ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘము.

వ్యవస్థాపకులు :

సాహితీసమాఖ్య, సాహిత్యకళాపీఠము, జాషువాకవి సాహిత్యపీఠము.

అవార్డులు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (కవిత) 1975

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే ఉత్తమ పండిత ఉపాధ్యాయ
బహుమతిగ్రహీత - 1975
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు గౌరవ డాక్టరేట్ కళాప్రపూర్ణ
పట్టము - 1974
కనకాభిషేక సత్కారము - 1974
గండపెండార సన్మానము - 1982

## జ్ఞానానందకవి గుఱించి విశ్వనాథ సత్యనారాయణగారి కొన్ని నుడువులు.

" నేటి హరిజనకవులలో నీవును జాషువాగారును రెండు శిఖరములవలె నున్నారు. ఆంధ్రకవితాశారద మీయందీరీతిగా నృత్యము చేయుచున్నందులకు నా హృదయ మెంతేని సంతోషించుచుండును. "

2—11—1963.

" చిరంజీవి జ్ఞానానందకవి నాకు శిష్యుడు. ఈనాటి కవులలో నుత్తములలో నొకడని చెప్పినచో శిష్యాభిమానము కానే కాదు. ఇతడు గొప్పకవి. ఇతని సీసపద్య మదొకనడక నడచును. "

23—3—1966.

" ఆధునిక కవీశ్వరులలో నిస్సందేహముగా నీకు స్థానమున్నది. నీకొక శైలికలదు. నీ పద్యలక్షణము నీదిగా నేర్పాటైపోయినది. "

4—1—1976.



# విషయసూచిక

## అంకితము

''కవికులాలంకార''

శ్రీ అమూల్యశ్రీ గారికి

కృతిపతి : అమూల్యశ్రీ



జూపూడి వంశసింధు క
ళాపూర్ణుం డమ్మలయ్య లలితహృదయునిన్
దీపిత కవితామూర్తిని
నా పద్యగ్రంథమందున ప్రశంసింతున్.

# అంకితము

సాహితీయస్వర్ణవాహినీలహరి గా
హనమొనర్చిన కళాభ్యర్ణమాళి
భగవదారాధనాభక్తి చింతనములో
నెడదనిల్పిన దయాదృజన్మయుండు
కలగుండుపడుమానవులకెల్ల తగురీతి
చేయూతనిచ్చు విశిష్టగుణుడు
క్షితిజనావళిపురోగతిని సంభావించు
ధన్యజీవనుడు సౌజన్యమూర్తి

సూక్ష్మభావుకుండు జూపూడి కులరత్న
దీపమునకు సుకవితాపసునకు
కృతినొసంగినాడ నీ రాజధాని కా
వ్యము నఖండగౌరవప్రదముగ.

ప్రభవమునందినప్పుడె సరస్వతి ప్రేమితో వరింప ధీ
విభవముతోడుగా కవనవిద్యయునబ్బెను పూర్వజన్మపున్
శుభములె గూడుకట్టుకొనజొచ్చెను సద్గుణ యుమ్మలయ్యలో
శుభములు కల్గకుండునె? విశుద్ధచరిత్రగలట్టివారికిన్.

బాధాగాధపుదైన్యపున్ బ్రతుకులో వ్యత్యస్తభావాలతో
బాధింపంబడు నీసమాజము కులవ్యాఘ్రంపు కాండ్రింపులన్
సాధింపుల్ గని యెంతతల్లడిలి స్వేచ్ఛన్గోరుకొన్నావొ యీ
నీ ధీమత్తతకున్ భవద్రచనలే నిక్కంపుతార్కాణముల్.

స్వార్థంబైన సమాజదుష్క్రియలు కుప్పల్కుప్పలై దేశభా
గ్యార్థంబున్ దిగమ్రింగునట్టితరుణంబం దీవు విస్ఫూర్తిమై
వార్ధావర్తానికి నంజలించి రచనాప్రజ్ఞాధురీణత్వమున్
సార్థక్యమ్ము నొనర్చినాడవు యశస్కా! యమ్ములయ్యాభిధా!

స్వశ్రేయమ్మును కాంక్షసేయక జగత్సర్వమ్ము సంక్షేమపున్
సుశ్రీలన్ దనివారగా బ్రతుకుటే శోభాయమానమ్మటం
చశ్రాంతమ్ము హృదంతరాళమున యందాశించు జూపూడ్యమూ
ల్యశ్రీ కెల్లపు డింపెసంగుశుభముల్ గల్గున్ మహీచక్రమున్.

కమ్మని తెల్గు కైతకు జగాయరుసమ్మును బొంది మెచ్చి చి
త్తమ్మున తత్కవీశ్వరునిధారకు మిక్కిలిదోయిలించి హ
ర్షమ్మును బంచిపెట్టునిది యాంధ్రసరస్వతి కెన్న మేలిభా
గ్యమ్ము కళావిదుండయిన యమ్ములయాఖ్యునకున్ జిరాయువుల్.

కులమతవర్గభేదములకున్ పిసరంతయు తావునీని య
త్యలఘుడు విశ్వమానవతయన్నను ప్రాణము వెట్టు సత్యపున్
పలుకున కాశ్రయంబిడిన పావనతత్త్వముగల్గువాని య
మ్ములయకు రాజధానికృతి మోదమునిచ్చితి నంకితంబుగన్.

పద్యం బేగతి వ్రాయగల్గునొ యదేపంథా ప్రయాణించు నా
గద్యంబున్ రచనాసమర్థతను పేర్గన్నట్టి జూపూడి వం
శోద్యత్క్రమ శిరోవిభూషణముగా నొప్పారు సాహిత్యమున్
హృద్యస్వాంతుని కమ్మలయ్యకగు సాహిత్యోజ్జ్వలన్మార్గముల్.

సరసముగా మనోజ్ఞముగ చాలకృతుల్ సమకాలపున్ గవీ
శ్వరులరసింప నమ్మలయ వ్రాసె లసత్కవితాఝురిన్ నిరం
తరమును స్నానమాడు సుగుణాలకు ప్రోవగువాడు వానికీ
వరకృతినీయ మామనగుభాగ్యముకల్గె కవిత్వలోకమున్.

కృష్ణవేణీధునీ సృష్టివిన్యాసమ్ము
లమ్మలయ్యకలాన కందునాడు
రత్నాలు రవ్వలు రమణీయకావ్యమ్ము
శ్రీయమ్మలయ్య సృష్టించునాడు
సాహిత్యసౌరభ శ్రీహితగంధమ్ము
నీయమ్మలయ నాంధ్రికిచ్చునాడు
మెత్తనైనపదాల క్రొత్తశకమ్మును
ఘను డమ్మలయ్య వాకొనిననాడు

మేదురంబైన సుకవితో స్నేహబుద్ధి
నాడెముగ నమ్మలయ జీవనాడులందు
కలసె సాహితీశారదవలచె నమ్మ
లయ్య తొలిజేసినట్టి పుణ్యంబదేమొ ?

ఎప్పటిమాట యైననిది యిప్పుడుచెప్పెద నెన్మిదేండ్ల చి
న్నప్పటినుండి సాహితికి నంకితమైన మహోదయుండు తా
నిప్పుడు చారుసత్కవనస్ఫూర్తినినిల్పిన సత్కవీంద్రుడై
నప్పటి కమ్మలయ్యమరె యూదకు నింకొక మారుపేరగున్.

పద్యం: ఆ భారతపర్వముల్ వ్రాయుకో
మ్మన్న నందనుడు తిక్కన్నయజ్వ
దయతోడ సరిలేని దానధర్మముసేయు
ప్రథితరాయనిమంత్రి భాస్కరుండు
సాహిత్యసామ్రాజ్య సార్వభౌముడు మహా
భాగుండు శ్రీనాధభట్టసుకవి
కళల కాలయముగానిలిచిన నాయండు
విస్ఫారదోశ్శాలి వేంకటాద్రి

వన్నెకెక్కిన గుంటూరు ప్రాంతమునకు
యశమునిల్పిరి శ్రీయమ్మలయ్యకూడ
కీరితినిగొన్నవారు గుంటూరువారు
అస్మదీయకృతికి పతియాట శుభము.

దీనత్వమ్మొకవంక సాంఘికదురుద్దేశ్యంపు వర్ణాలబా
ధానీచస్థితి యొక్కవంక జవసత్త్వాలన్ ప్రపీడింప వి
ద్యానై పుణ్యముజూప దీక్షమెయి గమ్యస్థానముం జేరి ప్ర
జ్ఞానిషన్ వెలయించె నమ్మలయసత్సంకల్ప మీడేరగన్.

మానవతావాదమె తన
ధ్యానముగా ధర్మముగనుతలచు నమూల్య
శ్రీ నైతికృషితో బియ్యే,
యానర్సు, పఠించె వంశ మాహ్లాదింపన్.

జూపూడ్యన్వయవార్ధిచందిరుడు సుశ్లోకుండు వీరయ్యకున్
దీపంబై తొలిపుత్త్రిగా నెలమిజన్మించెన్ లసత్సాహితీ
భూపుల్ మెచ్చుకవిత్వముం గిలుకునెప్డున్ సత్యవాక్యానకున్
తా పట్టమ్మొగి యమ్ములయ్య మహదానందానగట్టున్ వెసన్.

మిక్కిలి పెద్దవిద్య లలిమీరగ నేర్చినన్ వినమ్రతా
ఫక్కిని వీడనట్టి రసభావుకుడార్ద్రహృదుండు వాణికిన్
జిక్కిన విద్వదీడ్యునకు చిత్తము సత్యపథాన నడ్పు మా
అక్కమపెద్దబాబునకు నమ్ములయాఖ్యనకున్ శుభమ్ముతా.

ఉన్నతోద్యోగినం చెన్నడు స్వాంతాన
దలపని మానవతాహితుండు
ఎదిరివైరికినైన హితముగూర్చుటలోన
బాహిరించెడు మహాస్నేహశీలి
బ్రతుకుమార్గమ్ములో పరమసత్యమునకే
ధ్వజమునెత్తిన ఋజువర్తనుండు
కవికులాలంకార క్రమపట్టంబున్న
కవులబోషించెడు నవరసికుడు

సమతనెఱపనట్టి సుమతులుగల్గు సం
ఘమ్మునకు నమూల్య మమ్ములయ్య
యమ్ములయ్యకవిత లమ్ములై క్రాంతిప
థమ్ములై జనాళి కిమ్ముగూర్చు.

సరదాకోసము నాటకమ్ములను వ్యాసంగమ్ములన్ జిన్ననా
డురుహర్షమ్మున వేసి వ్రాసి జనులోహో! యన్న నాదాలలో
బిరుదైనట్టి కవిత్వశారదను సంప్రీతిన్ సమర్పించుచున్
వరలెన్ సత్కవిగాగ నమ్ములయ విద్వన్ముఖ్యు లగ్గింపగన్.

దేశహితార్థమై కవనదీప్తులుచిమ్మగ భక్తిమీర గాం
ధీశతకమ్ము నాపయిని తిర్మలతిర్పతి వేంకటేశ్వర
శ్రీశతకమ్ము వ్రాసిన విశిష్టకవీశ్వరు డమ్ములయ్య సం
దేశము లీప్రపంచప్రగతిన్ బురిగొల్పెడు దివ్యసూక్తముల్.

ఆడును సూనృతప్రవచనావళి నిచ్చలు నమ్ములయ్య తా
వాడును తేటమాట ప్రతిపద్యమునందున నమ్ములయ్య తా
వేడును లోకముల్ బ్రతుక విశ్వపతీంద్రుని నమ్ములయ్య యే
నాడెటువంటిపూజల నొనర్చెనొ యాతనికౌ చిరాయువుల్.

అతిమధురమ్ము మానసము నమ్ములయాఖ్యుని మాటమంతియున్
అతిమధురమ్ము చేతలును నట్టివె కొండొకభక్తిభావనా
మతియును నట్టిదే యిటుల మాన్యతగాంచిన యమ్ములయ్య నా
కృతికి పతిత్వభారమువహించుట పుణ్యవిశేషమౌకదా !

పాపలు భువనమ్మునకున్
దీపాలు సముజ్జ్వలంపు తేజఃకాంతుల్
పాపల విజ్ఞతకొఱకై
రూపకములు నమ్ములయ్యాలో రహియించెన్.

చిత్రలేఖనమున శ్రీయమూల్యశ్రీకి
చిన్ననాటనుండి చెప్పరాని
యంతుబొంతులేని యభిలాష కలదన్న
చిన్ననాటి తీరుతెన్నులివ్వి.

కృష్ణరాయల కళాతృష్ణకు నలసాని
తనిసి సత్కృతివెట్టుకొనినరీతి
ఘనుడు మారయ్యనందనుడు సింగన్నను
మెచ్చి నైషధకావ్య మిచ్చుకరణి
నంద్యాలభూవిభునకు నల్ల సూరన్న
యుప్పొంగి కావ్యమ్ము నొసగువిధము
తొలిరఘునాథరాయలకు వేంకటకవి
ప్రియమార కృతినినర్పించు తెఱగు

స్నిగ్ధహృదయుడైన శ్రీయమూల్యశ్రీకి
సహనశీలి కమలచరితునకును
నాదురాజధాని నవకావ్యకన్యను
వేడుకదరనొసగినాడ కృతిగ.

తనభార్యామణి సద్గుణాలఖని రత్నజ్యోతి సేవింప నం
దనలౌ బుజ్జియు బేబి చిన్నమలు సానందానవర్తింప నం
దనుడౌ మోహను చంద్రశేఖరులతో నట్టిల్లు స్వర్గమ్మటం
చనిపించున్ గవితాప్రియుండగు నమూల్యశ్రీకి భాగ్యంబిదే ?

ఈ నారమ్యకళా సరస్వతికి భర్తృత్వమ్ము శ్రీయమ్ముల
య్యానందమ్మున స్వీకరించుతరుణంబం దేను హర్షింతు రా
ణ్మాణిక్యాలోకనాడు సత్కృతుల గొన్నారిట్టులే నాటి మా
ర్గానన్ సాగిన యస్మదీయకృతి కారాణింపు లింపొందుతన్.

దినమణి రోహిణీధవుడు దిక్కులు తారక లెంతకాలముం
డిన మరి యంతకాల మవనీస్థలి యుండు మనోజ్ఞసాహితీ
ధనియగు నమ్ములయ్యకవితాకృతి భూమిని యంతకాలముం
డును కృతిభర్త శాశ్వతు డనూహ్యము లీకవితామహత్త్వముల్.

జాఫ్రాడివంశఘృణికిన్
కోపమ్మొకియింత లేని కోవిదధనికిన్
తీపగు కవితాధునికిన్
నాతతగుణరమ్యభావనా దినమణికిన్.

కరుణారసరమ్యచరితున
కరయగ గవితాత్మగ్గునమలకున్ ధీ
వరునకు రత్నజ్యోతి
స్ఫురదంచితహృదయనిలయ శోభితమతికిన్.

సంఘశ్రేయస్కునకున్
లంఘించిన యర్థకామప్రహాదినీలహరీ
జంఘిలునకు నరయ నిర
స్తాంఘస్సున కమ్ములయ్యకమృతపు హృదికిన్.

నిక్కపు వాగ్జానికి స
మ్యక్కమనీయకవితావిహారికి సుయశో
భాక్కునకున్ సన్మతులా
అక్కమవీరయల జ్యేష్ఠుడా పుత్త్రునకున్.

అనవద్యహృద్యకవితా
ధ్వనికిన్ జూపూడివంశవర్ధనునకు స
జ్జనునకు స్ఫూర్జన్మంగళ
గుణునకు శ్రీయమ్ములయ్యకు వితీర్ణునకున్.

ధీరునకు కవికులాలం
కారునకున్ రుచిరభావకంధికి నిజవా
క్సారునకు వినయశీలికి
చారుచరిత్రునకు దివ్యసంస్కారునకున్.

ప్రాజ్ఞునకున్ మేలిమ్కళా
భిజ్ఞునకున్ విశ్వలోకవిహితునకు క్షమా
యజ్ఞశ్రీకి మనోజ్ఞర
సజ్ఞునకున్ సాధుకవికి సన్మార్గునకున్.

కాకినాడ-3

1-11-1986.

గ్రంథకర్త

సురగాలి

# నన్నయభట్టు

తెలుగు మాగాణి భూముల దొల్త తిరుగాడు
దేశీయకవితకు తెరువుసూపి
కుండవాంబాదేవి కొడుకు గీచినయట్టి
విజ్ఞతాయుతపు టనుజ్ఞ దాల్చి
శిరమెత్తి యింత యూపిరిపీల్చుకొన్నవై
దికతత్త్వమునకు పథకమునైచి
సకలభాషా కళాజలరాశి ఘనుడు నా
రాయణభట్టు సాయమ్ము నంది

తొలిమహాంధ్రకవిగ నిలిచి మా నేలలో
రమ్యమైన యక్షరాల విత్త
నాలు సల్లి యదొక శైలి నీవిగనిల్పి
నట్టి శబ్దశాసనా! జోహారు.

మధురములైన సంస్కృతసమాసములన్ జొనిపించి వైదిక
ప్రథనిలిపింప వ్యాసముని భారతమున్ దెనిగించినావు ప్ర
ప్రథమముగా మహాంధ్రమున రాజిల రాజనరేంద్రుడెన్న నీ
పథకము హర్షణీయము ప్రపంచముమెచ్చె కవీద్గజేంద్రమా!

యోజనగంధి నందనుని యూహకు నీవొక యూహచేర్చి యు
త్తేజముగా మహాంధ్రమున దిక్కులు మ్రోగగ భారతమ్ము వి
భ్రాజితమూర్తి! వ్రాసితివి పండుగయయ్యెను తెల్గునేల కీ
రోజున నేమినోచుకొనిరో కద! తెల్గులు నన్నయాభిధా!

ఆ రాజేంద్రు నెడందలో మొదలు నూహారేఖ లీకైతకున్
ప్రారంభమ్మయి రెండుపర్వములపైపై నర్ధపర్వమ్ము భా
షారమ్యమ్మన నీకతమ్మనను దీక్షన్ త్వన్మహాగౌతమీ
తీరంబందు రచింపగాబడుట నాంధ్రీదేవతాభాగ్యముల్.

అనుకూలసమయాన తనివార పశ్చిమ
సంధ్యామరుత్తుల స్వాగతమ్ము
ప్రతినిమేషము రాజరాజనరేంద్రుండు
సహకరించిన మహోత్సాహబలము
నిను నెప్డు డావహించిన కుమారిలభట్టు
చూపించు వైదికసూత్రగీతి
గొనబు నీమస్తిష్కమున విహారముసేయు
పంచపాండవుల గొప్పందనమ్ము

నీరచనమున కది ప్రేరణమ్ములు వ్యాస
భారతమ్ము హృదయధారణమ్ము
ఆంధ్రగేహమునకు నదియ యలంకార
తోరణమ్ము గర్వకారణమ్ము.

రమణీయాక్షర రమ్యసారకవితార్థశ్రీ ప్రసాదింప ను
త్తమధర్మైక హితోపదేశము సముద్యద్రీతిభాసింప పం
చమవేదమ్మగు భారతమ్మును ఋషిచ్ఛందోనిబద్ధమ్ముగా
నిమడన్ వ్రాసిన నీకు మా ప్రణతులోయీ! పద్య విద్యాప్రభూ!
శోకశ్లోకుడు బోయరాట్సుకవి వాక్సారత్వమే శ్లోకమై
లోకంబందున నిల్చె రాఘవునికీర్తుల్ నింపి యీ తెల్గుభా
షాకల్యాణియు నిల్చె నీవలన నీసాహిత్యలోకమ్ములో
బాకీపడ్డది తెల్గుజాతి రసశబ్దబ్రహ్మ! నీ కుర్వరన్.

గానబారన్ మధురస్రవంతియగు నీగోదావరీ పుణ్యజీ
వనమందున్ తమిదీర మున్కలిడి విశ్వక్షేమ వాంఛామన
మ్మున ఘంటమ్మును కేలబూని రసలుబ్ధుల్ మెచ్చ సాహిత్యపున్
గనియౌ భారతమున్ రచించితివి లోకజ్ఞా! కవిగ్రామణీ!

హాళగన్నడములోని విలసనోజ్జ్వలమంజు
వృత్తమ్ములను స్వీకరించునాడు
వేంగీధరాస్వామి పేరోలగమ్మున
ప్రథమతాంబూలమ్ము వడయునాడు
తెలుగులో తొలికావ్యమలర నిర్మలమైన
భావమ్ముతో స్వస్తి పలుకునాడు
త్రిదశ భాషాశక్తి పొదిగించి తెల్గులో
సుప్రసన్నత జాటి చూపునాడు

నీ పునీతబుద్ధి నిపుణతచే తెల్గు
నేల భారతమ్ము వ్రాలునాడు
మఖౌకస్స్వర్గ మేల ? మధురశర్కర యేల ?
నన్నయాభిధా ! ప్రణామశతము.

నీవాంధ్రుండవో ? కావో ? యెవ్వరివో ? గానీ నేటియీ తెల్గుభా
షావిద్యుల్లత వెల్గె నీయమృతహస్తచ్ఛాయలో పొంగి వేం
గీవిశ్వంభర రాణ్మహేంద్రవరమున్ గీలించె కీర్తిప్రతి
ష్ఠావిభ్రాజిత వజ్రసంభృతకిరీటమ్మున్ మహానందమున్.

ఓయీ సూక్తినిధీ ! ప్రసన్నకవితావ్యాహారకళాసేవధీ !
వేయేండ్లైన జయంతి నీది యిట నువ్విఖ్యారుచున్నట్టి మో
దాయోగ్యమ్మున సాగుచున్నది మహాంధ్రక్షోణి వీక్షింప రా
వోయీ ! పూర్వచళుక్యభూపు డిట లేడోయీ ! విచారంబగున్.

నీపయి నెవ్వడో కినిసి నిన్నపరాధిని చేయజాలగా
మోపె నభాండమొండు నిజమో? మఱి కాదో? యెవండెఱుంగు మా
కాపనితో పనేమి? కవితామృతభాండమొసంగి సాహితీ
దీపమునిల్పినట్టి కవిధీమణి వందులకే నమస్కృతుల్.

తొలగునా దారిద్ర్యవలయశ్శృంఖలముల
బంధితంబగు కవీశ్వరుని బ్రతుకు
వెలుగునా పుట్టగొడ్గుల ప్రక్రియలమధ్య
దయివార ఋషిసంప్రదాయకవిత
కలుగునా భేదాల కలుషధారుణిలోన
నణగారు కవికి మహాశ్రయమ్ము
మలగునా సవిమర్శకులు లేని తావులో
నందాల సుకవితాస్యందనమ్ము

రాజరాజు నిన్ను పూజించి పోషించె
నీయదృష్ట మదియ నేడు రాజ
రాజు లేడు తగినరసికుండు లేడోయి!
స్వార్థభూత మిట పచారుసేయు.

25-3-1983



శబ్దమందు నర్థసంప్రదాయచ్ఛాయ
బంధమందు వాక్యపటిమనందు
శైలియందు నిన్ను బోలియుండును న్మార
నాహ్వాయుండు తిక్కనాహ్వాయుండ !

1-11-1982



# నాచన

కొమ్మనామాత్యునికొడుకు తిక్కనకవి
తేట తెన్గుపదాలబాట నడచి
పరిపూర్ణసాహిత్తీధ్వనికిమూలమ్ము కుం
తకుని వక్రోక్తి డెందాన తలచి
లలితలావణ్యమంజుల శబ్దకుశలుండు
దండివాఙ్మయవార్ధి తానమాడి
ఘనుడు విద్యారణ్యమునిశిష్యులగు హరి
హరబుక్క రాయల యాత్మనలరి

తరుణ విజయనగరచరితలో మొదటియా
స్థానకవిపదమ్ము దాల్చినట్టి
నవ్యగుణసనాథ ! నాచన సోమన !
స్వీకరింపు మివియె చెంగనాలు.

పదనా సత్కవితాసరస్వతికి శబ్దబ్రహ్మవై నిల్చి మేల్
పదమాధుర్యమనోజ్ఞ మార్గకవితావైశిష్ట్యఘంటాపథా
న దమిన్ సాగిన నీచరిత్రకు మహాంధ్రమిమ్మెప్పు డర్పించుచు
న్నది నీరాజన మందికోవలయు సన్నా! సాహితీసోమనా!

గుండెకు తాకు తెల్గుపలుకుల్ తనకబ్బములోన నిల్వను
ద్దండత తీవి నిష్ఠమెయి దాయలగుండెలు దద్దరిల్ల ప్రో
చ్చండమహైకయజ్ఞమును సల్పెను తిక్కన నీవు పిమ్మటన్
రెండవతిక్కనార్యువలె నిల్చితివోయి రసైకభూషణా!

నరునకు రక్షయౌ కుధరనాథునినందన భర్తయైన శం
కరుని పదాలవ్రాలిన యఖండకవీశ్వరు డెఱ్ఱనార్యు బం
ధురహరివంశకావ్యమును త్రోసినయట్టుల వ్రాసినాడ వు
త్తరహరివంశమున్ సుకవితారసపోషణ ! మేలోయి ! నాచనా !

శంభుదాసుని కథాంశములోని యుద్ధవ
ర్ణనలకు మారువర్ణనల దెలిపి
రచనావిధమ్ములో ప్రతిఘట్టమందు శ
య్యానైగనిగ్యమ్ము లలరజేసి
కాళిదాసుని యుపమాలంకృతికి మెచ్చి
భారవి యర్థసంపదకు మ్రొక్కి
మహిమైకసాహిత్య మర్మ విజ్ఞానసం
బంధి మాఘునితోడ పందెమాడి.

పురుషసూక్త మంత్రములను మైనమువోలె
తెగులుపద్దియముల దించి దించి
యందజేసినట్టి సౌందర్యశబ్దసా
రథ్యమునకు నా వరాలగీతి.

నీసాహిత్యములోన చోటుగొని రాణించెన్ మునిప్రోక్తభా
షాసౌందర్యకళామతల్లి ! ధిషణాసర్వజ్ఞమూర్తీ ! రసా
భాసత్వానకు తావులేని ఘనశబ్దబ్రహ్మ ! విద్యోతిత
శ్రీసాహిత్యమనోజ్ఞ సంస్కృతి హసించెన్ నీప్రమేయమ్మునన్.
నీ సీసాలకు ముగ్ధుడై తనివిసెందెన్ నీ చమత్కారశై
లీసౌగంధ్యధునీతరంగములపాళిన్ డోలలాడెన్ యశ
శ్శ్రీసంపన్నత గాంచె నట్టిఘనుడౌ శ్రీనాథు డీనేటి మా
యీ,సీసాలకు మార్గదర్శకుడు భాయీ ! సంవిధానప్రభూ !

నేర్చెనా సహజపండితుడు పోతనకవి
నీ రచనారమ్య సారసుధలు
కూర్చెనా వాఙ్మయకువలయేక్షణ మహ
త్వనవీనగుణ సనాథత్వగరిమ
మార్చెనా నిను సంగమకులప్రధానుండు
హార్ద్రమ్ముతో నగ్రహారికు నిగ
తీర్చెనా సాహితీదీక్షావ్రతమ్ములో
శారద నీలోని సంశయమ్ము

సర్వమానవాళి సమత గాంక్షించుచు
హరిహరులకు కావ్య మంకితమ్ము
నెఱపి జీవితాన గురుపాదులగు తిక్క
యజ్వచరణధూళి నంటినావు.

పరిఖేదంబిడు శైవ వైష్ణవ మతప్రధ్వంస ఝుంఝామహో
ద్ధురకాండోద్ధతితాండవార్భటికి నెంతో కుంది నీకావ్యసుం
దరినిన్ శంకర విష్ణుభేదములకున్ తావీక సర్వోదయ
మ్ము రహిన్ జాటినయట్టి నీదు రచనావ్యూహానకున్ జోతలౌ.

1-11-1982



# బ్రహ్మనాయుడు

ఓయీ! శీలమవంశవార్నిధిశశీ! ప్రోద్దండశౌర్యోద్ధత
శ్రీ! యాన్నత్యసమగ్రసంభృత జయశ్రీసుప్రతిష్ఠాప్రధా
న్యాయోద్ధర్త ! మురారిరూప ! నిలిచెన్ గాలప్రశంసామహే
చ్ఛాయోగమ్మున నీజగమ్మున భవచ్చారిత్ర మో బ్రహ్మనా!

తలవ్రాతల్ మఱిగాక సోదరుల బంధమ్మింత సంధించు నా
చెలిమిన్ ముక్కలుసేసి రెండవకురుక్షేత్రమ్ముగా పాల్చె నా
పలనాటన్ పగవల్ల నేమిపావుకొనె నప్పా ! రెండువంశాలు పా
టిలె నీబంధములన్ని యెన్న నొకరెడ్డిస్త్రీ ప్రయోగమ్మునన్.

స్థాపించితివి సమత్వముజాటగా చాప
కూటిసిద్ధాంతమ్ము కువలయాన
నిలిపించితివి సంతసిలి చమూవారాన
నిఖిలవర్ణాల మన్నిలనెల్ల
వహియించితివి మహాభైరవఖడ్గమ్ము
కదనాన పరిపంథి మదమడంచ
పూజించితివి స్వాంతముతరింప నిరతమ్ము
సిరిచానపెనిమిటి చరణయుగళి

దీక్షతోడ ధర్మదీపాలు వెలిగించి
తవులు జాతిభేద మవల ద్రోసి
ప్రేమమూర్తియైన రామానుజస్వామి
పథము నడచినావు బ్రహ్మనాయ !

నీ సర్వోదయమైన డెందమున కానిపించున్ సమత్వమ్ము నీ
తోసాటెవ్వడు దొడ్డనాయని సుపుత్రుం డిట్లుసాధించి నా
డేసైన్యమ్మున జాతిభేదముల తావేలేని మన్నిలతో
వాసింగాంచియటన్న వాక్కు లయితాంబానాథ ! సత్యంబగున్.

వెలసె విశ్వంభరావలయాన తులలేని
రేచెర్లగోత్ర కీర్తిప్రతిష్ఠ
తెలిసె లోకానకు పలనాటి మాచర్ల
చెన్నయ్య మందిరశ్రీమహత్తు
బలిసె హుంకారాన తలయెత్తి చెన్నకే
శవుని ప్రాంగణమందు జమ్మిచెట్టు
నిలిచెయుగాల సంస్కృతులకు చిహ్నమ్ముగా
ప్రకటితంబైన పలకలబావి

క్షాత్రసంప్రదాయసరణి నిల్చినశౌర్య
విస్ఫురితులు తెలుగువెలమవారు
నీవు వెలమగా జనించి నించిన యశో
డిండిమము దిశల కడింది మ్రోగె.

నాయకురాలి కుట్రవలనన్ నలగాముడు నీకు వేఱయై
పోయెను కోడిపందెముల పోరును కల్పనచేసి సోదర
శ్రేయము బుగ్గిలోగలుప చివ్వకు కాలునుసాచె భేదపున్
మాయల నాగసాని జనమాన్య! యికెంత తపించినాడవో.

ప్రాణప్రాణముగాగ మాడుగుల వీరారెడ్డి నాగమ్మప
క్షాన న్నిల్చెను నీకుమారుడు మహోత్సాహమ్ము రెట్టింప శౌ
ర్యానన్ నిల్చెను నీదుపక్షమున జన్యక్షోణిలో తప్పలే
దా ? నీవున్ బవరాననిల్చుటలు బ్రహ్మన్నా! విధివ్రాతయా.

సాగగ సంధికార్యముల చక్కగజేయగ రాయబారిగా
నేగిన రాచమల్లునకు నెట్టిది ఘోరవిపత్తుగల్గె నం
చూగిన నీయెడంద జ్వలితోగ్ర మహాగ్నిధరాభ్రమైన ద
య్యా! గమనించి యాలమునయందున భైరవఖడ్గమెత్తితో.

అరవిల్లికులజులౌరాలైన నాగమ్మతో
జృంభించి బవరమ్ము సేయువేళ
శైవమ్ముకన్న వైష్ణవము గొప్పదనంపు
ధాటిని లోకాన జాటువేళ
నలుకగాబడినట్టి నరసింగు శిరమును
గాంచి కన్నీటిని కార్చువేళ
జన్యరంగమునందు సైన్యాధిపత్యమ్ము
నపరపార్థునకిచ్చి యలరువేళ

తీక్ష్ణమై వెలుంగు త్రికళింగశూరతే
జస్సు నిన్ను గ్రమ్మి చనినవేళ
భండనమ్మునందు రెండవశౌరివై
వెలిగినావు తెలుగు వెలమవీర!

కార్యమపూడి మీసమరగాథకు తెన్నయి నాటి మీవ్యథా
క్రౌర్యతచాటు నిప్పుడవురా! యిరువర్గమువారి దర్పదో
శ్శౌర్యముచూపెడిన్ చరితసత్యము శీలమువంశ్య! నీయశో
ధుర్యత తెల్గుభూములకు శౌరపువెన్నెలపంట నిచ్చెడిన్.

అనిముందు పేరుకెక్కిన శౌర్యధుర్యుండు
కమ్మరకాచన్న కడిమిపటిమ
అరివీరభటభయంకరుడు విక్రమశాలి
మంగలకులమల్లు మహితబలము

పగరపోగరడంచు భండనోద్దండుండు
కమ్మరిపట్టి ప్రోద్గాఢశక్తి
రణరంగవీథివిరాజ ద్విషహారుండు
చాకలసందన్న సాహసమ్ము.

దండిమగడు పంచముండు కన్నమనీని
యతుల ధీరతామహాప్రతాప
శిఖరశాంగణాన చెలగె మొత్తమ్ములై
బాలచంద్రువలన బ్రహ్మనాయ !

కదనభూమికేగు నదనున దారిలో
నెదురుకొన్న రెడ్డిముదిత గాంచి
స్త్రీలతోడ పోరుసేయుట తగదన్న
నీసుతుండు ఘనుడు నీతిపరుడు.

ప్రియసుతుడంచు నెంచక పరీక్షనుపెట్టితి వాతడందులో
జయమునుగొన్నచో సమరసైన్యపతిత్వము బూనునంచు ని
ర్దయతను నీమహోహలు యథార్థములై వెలుగొంది దిక్కులన్
పయనముసేయుచున్న యవి బ్రహ్మన! మాన్యమహైకభావనా!

హైహయవంశవారసుడు నౌ నలగామునిమంత్రివై నిరు
త్సాహముతోడ నాసవతితమ్ములమధ్య సెలంగు వైరపున్
వ్యూహములెల్లచూచి యెద నుక్కిరిబిక్కిరియైన నీమహా
సాహసబుద్ధి వేఱొకట స్థానము నామలిదేవు డిచ్చెబో.

నలగామున్ గురజాలనున్ విడిచి యన్నా! నీవు మాచర్లభూ
ముల నిప్పించితి వట్టివేళ మలిదేవుల్ మోదముం జెంద నా
నలగాముండునుచేసె మంత్రిణిగ నా నాగమ్మనున్ జూచుకో
వలె నాడేమొదలయ్యె కయ్యములకున్ ప్రారంభవిద్వేషముల్.

నాగమ్మకుటిలయత్నాలలో తొలిదైన
కోడిపందెములలో నోడునాడు
పందెమ్మునాటి యొప్పందమ్ము చందమ్ము
నెలమిమై శిరసావహించునాడు
ఏడువర్షాలుగా మేడపిసీమలో
నజ్ఞాతవాసులై యలరునాడు
మాచర్లరాజ్యమ్ము మరల మాకిమ్మని
కడుబత్తి నలగాము నడుగునాడు

నీవుచూపినట్టి నేర్పును నోర్పును
సత్యవాక్నిరతిని చరిత తెలుపు
విష్ణురూపమందు విశ్వాసవెలసిన
బ్రహ్మనాయడా! నివాళు లగుత!

నలగాముతిరస్కారము
నల నాగమనాయరాలి యసహనమగు చే
తల పలనాటిబ్రతుకు లవి
నలిగెన్ శీలాంబనందనా! బ్రహ్మన్నా!

చంచత్పౌరుష! భర్తృజీవితములో సాబాలుగై కొన్న యా
మాంచాలాసతి శత్రువాహినులతో మార్కొన్నతీరున్ తనూ
ప్రాంచద్వల్లిక లల్లలాడు గననౌరా! రక్తసిక్తాంగమై
ముంచెత్తించెను మిమ్ము విభ్రమమహాంభోధీ తరంగాలలో.
మతవిద్వేషదవాగ్నికీలలు మిమున్ మారాడనీకుండ మీ
మతులన్ గాల్చెను నన్నదమ్ములను సంభావించి యీయాహవ
క్షితిలో నిల్పెను రెండువంశములు భస్మీభూతమయ్యేన్ జగ
న్నుతచారిత్ర! మిగిల్చిపోయిన కథామఃఖమ్ము వెన్నాడగన్.

చనియెనే యీనాడు ఘనరాచమల్లుని
సవరాల గోడిగ చంద్రవంక
వెడలెనే దొడ్డనాయడు యాత్ర కీనాడు
అలుగురాజుని యాన యార్లగండి
స్నానమాడెనె బాలచంద్రయ్య యీనాడు
దారిదప్పక గంగదారిమడుగు
మెఱయునే యీనాడు మిఱుమిట్లుగొలుపంగ
కన్నమ భైరవ ఖడ్గధార

ఏమిబోధగఱపు నీనాడు పల్నాటి
వీరభూములెల్ల వెలమవారి
కీర్తి చంద్రికలకు కేతనమైనిల్పు
పాఠములనుగాక బ్రహ్మనాయ!

28-10-83



# శ్రీనాథుడు

గాఢశ్లిష్టసమాసబంధురధురాకావ్య ప్రబంధైక వి
ద్యాఢంకానినదమ్ము మ్రోగినది యాంధ్రక్షోణి నీవల్ల నా
రూఢస్ఫూర్తి ప్రబంధదివ్యకవితారూపమ్ము శ్రీనాథ! ప్రో
ద్గాఢౌన్నత్య ప్రశస్తి నీవలన పొందంగల్గె వాగ్దేవియున్.

నీఘంటాన ననర్ఘలాఘవ సమున్మేషప్రథాప్రత్నసం
ద్రాఘిష్ఠ స్ఫురదంశసంభృత సముద్యన్మంజులశ్రీ కవి
త్వౌఘప్రాభవసిద్ధి సంకలనమో హో! నిండుగంధేభ ధా
టీఘట్టమ్మగు శైలి నీది రచనాశ్రీవిన్ ప్రదర్శించెడిన్.

సాక్షాచ్ఛంభుని సత్కృపామృత శుభాశంసాప్రవాహమ్ములో
సాక్షాత్కారము జెందినట్టి కవితాసామ్రాజ్యసింహాసనా
ధ్యక్షస్థానమునంది భూపతుల సత్కారమ్ములంబొంది భా
షాక్షోణిన్ వెలిగించినావు ప్రతిభాసమ్మోహదీపాలతో.

వాణీమంగళకింకిణీక్వణము లొప్పన్ ధ్వన్యలంకారసం
ధానప్రక్రియలన్ సుధామధురశబ్దాలన్ సృజింపన్ గవీ
శానా! నీవాకరుండవే తెలుగుభాషాలోకమం దెన్నగా
శ్రీనాథుండవు నీవు నేను కవితాశ్రీనాథుడన్ భక్తుడన్.

సూక్ష్మగ్రాహులు సాహితీకవనపోషుల్ పేరుగన్నట్టి రె
డ్డిక్ష్మాదారులు నీయఖండరచనాశ్రీవిన్ ధ్వనిన్ శబ్దసం
లక్ష్మిన్ శైలిని గాంచి మెచ్చి యనునాదరన్ గౌరవోదార సు
శ్రీక్ష్మాశైల మహోన్నతాగ్రమున యిన్ శ్రీనాథ! నిన్నుంచరే?

వాసింగాంచిన సీసపద్యరచనావైశిష్ట్యగంభీరధా
రాసంరంభవిజృంభణమ్ము పొలుపారన్ నీమహాఘంటమం
దో సాహిత్యజగత్ప్రభూ! పరువులెత్తున్ తథ్య మీ తెల్గుభా
షాసామ్రాజ్యము నేలు నీకునగు నా శ్రద్ధాంజలుల్ భక్తిమై.

ఏమీ! చిన్నవయస్సులో తెలుగులో నేకాక గీర్వాణభా
షామాధుర్యము శౌరసేని రచనాసామర్థ్య మా మాగధీ
ప్రామాణ్యమ్మను ప్రాకృతప్రభవభావప్రాభవోన్మేషముల్
ఆములాగ్రముగా నెఱింగితివి విద్యానాథ! ధన్యుండవో.

అనినతోడనె తెలుంగాధీశుడంపె నా
జగజంపు నిగరాల మృగమదమ్ము
వినినంతోడనె నీకు వీరభద్రారెడ్డి
పరిణమల్లి యిడెనె విద్వాంసుపదవి
కనగనే యాతిథ్యము నిడెనె విస్నన్న
భక్తి మీఱగ హేమపాత్రియందు
వినయాన మైలారవిభుడు తీర్చెనె దిన
వెచ్చమ్ము బ్రతుకింత వెళ్ళబుచ్చ

భళిర! పాకనాటివాడ! నీభాగ్యమ్ము
తలపనేడు గుండె జలదరించు
స్వారిసేసెనాడు శారదాదేవి యాం
ద్రమ్ము పొంగ కవనరథము నెక్కి.

తమితో నీవల కాంస్యఢక్క నటబ్రద్దల్ సేయ నాగాడడిం
డిమభట్టున్ ప్రతివాదమందు నిలువంబెట్టించు నీదైన వా
దము శాస్త్రీయవిధాన మబ్బురముగాదా! కోవిదశ్రేణి వి
భ్రమమున్ జెందెను నీయఖండకవితాపాండిత్య వాగ్రీతికిన్!

చంద్రభూషక్రియాశక్తి పండితుని చే
గెలుపుపట్టమునంది నిలుచునాడు
కొలువున్న ప్రౌఢరాయల మేలిముత్యాల
శాల బసిడినీట దేలునాడు
సర్వజ్ఞసింగభూజాని గౌరవముతో
నందిచ్చు సత్కార మందునాడు
అవచితిప్పయసెట్టి హర్షాన నిడినట్టి
ప్రేమోపదల స్వీకరించునాడు

ఓయి! కవిసార్వభౌమ! యిద్ధోరుకీర్తి
సౌరభములు జగా తెల్గుభూమ్మతలమున
నాల్గుదిక్కుల నిండించినావు నీవు
నడలు రచనలో పండించినావు నీవు.

చవులూరించు సుధాపదార్థముల మృష్టాన్నమ్ములన్ మెక్కినా
డవు భోగమ్ముల దేలినాడవు యశోఢంకన్ బజాయించినా
డవు జొన్నన్నము దిన్నవాడవట చల్లాయంబలిన్ ద్రావినా
డవు సాహిత్యజగత్తులో నిలుచువాడా! నీకు గైవారముల్

పరిణతింపన్ తెలుగున్ ప్రబంధకవితాపద్మాక్షి నీవల్లని
ల్చెను ప్రాణమ్మనబొల్చి యీ తెలుగు సుక్షేత్రాన మానోజ్ఞశై
లి నిరూపించును నీవిధానములు మేల్మిన్ గూర్చు నైపుణ్యముల్
తెనుగుంబాసకు నందచందములు దిద్దెన్ శైవదీపారతా!

ఘనకీర్తిద్యుతిసౌధమం దలరి నిక్కంబైన సాహిత్యపూ
జనమే భాజనమంచు నెంచుకొను సచ్చారిత్రతా రెడ్డిరా
ణ్మణు లానందమునొంది నిన్ను గడుసన్మానింప భీమాంబనం
దన! యీ యాంధ్రసరస్వతీచరణ నృత్యధ్వానభాగ్యమ్ములా.

బాధలువడ్డ నీచరమభాగపు జీవితమున్ పఠింప శ్రీ
నాథ! దరిద్రించుగుండియలు నాటికి నేటికి మేటిసాహితీ
ధుర్యధరమెక్కు దీమసము గల్గినవాడవులే, ప్రసిద్ధధా
రాధుని నీవులే, సుకవిరాజువులే, వరివస్య నీకగున్.

గంపెండాస యెడందలో మొదల స్వర్గంగన్ తపశ్శక్తిమై
దింపెన్నేలకు నాభగీరథుడు నీ ధీసౌరభమ్ముల్ గమా
యింపన్ తెల్గులనేలలో నటులెవ్వరోయీ! నీవు నిండించినా
వింపారన్ గవిసార్వభౌమ! యెవడోయీ! సాటినీకీభువిన్.

పాపిష్టుల్ రసహీను లాడ్డెపభువుల్ పాలించుకాలాన నే
శాపంబో మఱిజుట్టిముట్టి పలుకష్టక్లిష్టఘట్టాలలో
రాపాడించెను నిన్ను మారయకుమారా! పెద్దపావియమ్ములో
లోపంబయ్యెనె? యన్నవస్త్రముల కాలోకింప దుఃఖంబగున్.

ఘనతరసంపదావళుల కానుకలన్ మనసార నీకు న
ర్పణమొనరించి యీ తెలుగుబాసకు వన్నెలుగూర్చు రెడ్డిరా
జ్జనపతు లేలుకాలమున సర్వసుఖమ్ములదేలు నీవు నా
డ్డెనృపులు పెట్టుబాధలు పఠించిన మాకు జెమర్చుగుండియల్.

అరయగ నీదు భోజనప్రియత్వము తెల్గుల యచ్చసంస్కృతి
స్ఫురణము సాహితీరసపరిపూర్ణకళాకుశలమ్ము మాకు న
బ్బురము తెలుంగునాడెది యొ పున్నముచేసికొనెన్ నినున్ మహే
శ్వరపదపంకజప్రణతి భక్తశిఖామణి గన్నదాటచే.

నీచాటూక్తులు నీప్రబంధములు వాణీరూపమై తెల్గుపో
ణీచక్రాన పచారుసేయు నవుగానీ! నాడు పల్నాడులో
నీచిత్తమ్మున కెక్కనోగిరము లేనేలేకపోయెన్ రుచి
శ్రీచెల్వారెడు నోగిరా లిపుడు నూరింపించు పల్నాడులో.

కుహనాపండితు లీసడింపులవి నీకున్ దప్పలేదా? మహా
మహనీయంబగు సత్ప్రబంధరచనామాన్యుండ! నీ సాహితీ
లహరీశీకరడోలలో తెలుగు లశ్రాంతమ్ము దోగాడి ని
న్ననామమున్ భక్తిని పూజసేసెదరు శ్రీనాథా! శివారాధకా!

నీజిహ్వాంచలసీమలో నలరు తేనెల్ సిమ్మ నోజోగుణ
భ్రాజన్మంజుపదాలు కుంతకుని శబ్దశ్రీలు గీర్వాణభా
షాజైవాతృకముల్ యథార్థములు నీ శైలీకళావిన్యాసవి
భ్రాజన్మార్గము లిప్డు నెప్పుడును దీప్రకాంతి యాంధ్రాళికిన్.

కెరలి జృంభించిన కృష్ణమ్మ వరదలో
ధ్వంసమయ్యెనె నీదు పంటచేని
పరమశాత్రవు లాక్షపభువు లేల్బడిలోన
మరుగుజొచ్చెనె నీదు మహితకవిత
తనివినియ్యని తిండి తినుటచే ముదిమిలో
జిడ్డువట్టెనె నీదు జిహ్వాకళిక
అనుకోని దుర్భరమైన కష్టాలకు
చివికిపోయెనె నీదు జీవితమ్ము

ఓయి! కవిసార్వభౌమ! నీ యున్నతంపు
తలపు లేమాత్రమును నాడు తగ్గలేదు
చెప్ప నేటికి నీకు నుజ్జీలు లేరు
సుకవితానాధ! శ్రీనాథ! సూరినాథ!

7.12.198



ని

# త్యాగరాజు

పుడమితల్లి యనుంగుబొట్టె పెన్మిటి దాశ
రథి నామజపసముద్రమున మునిగి
బహుభక్తి మెఱయ నాహ్వానించు ధరణీశు
రమ్యగౌరవము తిరస్కరించి
నోటిలోనికి మూడుపూట లున్ననుసరే
యాచనావృత్తికి నడ్డుసాచి
లసదఖండ విలాస లాస్యమార్గము బోక
భక్తిమార్గమునందు పదమువైచి

అంతరంగమందు నద్దెడు గిద్దెడా
రాగరసములూర తీగె మీటి
తెలుగువారి పరువు నిలిపిన త్యాగరా
జా! జోహారు లివిగో! యందుకొనుము.

నీ నాదమ్మున నల్ల స్వర్గమునకున్ విశ్వానకు న్నీవు ని
శ్రేణిన్ గట్టితివోయి రాగరసమూర్తీ! నేటి సంగీత వి
ద్యానేతల్ భవదీయ గానఝరులం దానంద ముప్పొంగగా
తానాలాడుట కీవె కారణము, సద్బ్రహ్మ! త్యాగాహ్వయా!

తెలిసినవాడవై దశరథేశుని ముద్దులసూనుడౌ సిరా
ములను హృదంతరాన సతమున్ భజియించి మహోగ్రులైన శ
త్రుల సమయించువాని బలితోషము తొంబదియాఱుకోట్లు సా
రుల జపియించినాడవట క్రోధమెఱుంగని శాంతిభావుకా!

కావేరీతటినీ తటాంచల మహాగ్రామమ్ములో దివ్య మే
ధావై శద్యముగల్గు దంపతుల యాదర్శమ్ము లోకమ్ములో
తీవల్ తీవలు సాగగా భువి యశోదీపమ్ము వెల్గింపగా
నావిర్భావమునందు నీకగుత త్యాగయ్యా! ప్రపూజాంజలుల్.

చెప్పెనా నీతల్లి సీతమ్మ యింటిలో
కృతివర్ణనలకు సంగీతవిద్య
మప్పెనా నీతండ్రి మహనీయతను జాటు
నమృతంపు టుపనిషదర్థపటిమ
విప్పెనా నీమొజ్జ వేంకటరమణయ్య
రసరాగరమ్య వరాలపేటి
కప్పెనా మునిచంద్రి గాధిసూనునిశిష్య
మహిత షడక్షరీమంత్రశాటి

ప్రేమమీర నీకు రామకృష్ణానందు
డా స్వరార్ణవమ్ము నందజేసి
నీదు గానకళకు నిండించె శోభను
ధన్యతముడ వీవ త్యాగరాజ!

మావారే తమపూర్వులందఱును మామర్యాద లీవేళ నా
కావేరీనది దాటి విశ్వమున పారెకన్నీ వె మూలమ్ముగా
దా! విద్యానిధి! సాధుసీరసధునీ! ధర్మైకసంగీతల
క్ష్మీవై శిష్యపుగాలి లోకమునవీచెన్ నీ తపశ్శక్తిచే.

ఇఱువదినాల్గువేలకృతు లీవు రచించితివంచు పల్కుచుం
దురు ఘనులైనధీమణులు ఘోరముగా మఱినేడు లెక్కకున్
గుఱియగు నేడువందలె యకుంఠితమైన భవత్కృతుల్ జనా
దరమును పొందు నిప్పటికి ధాత్రిని నెప్పటికిన్ గళానిధీ!

కోర లేదెప్పుడు కువలయపతుల ద
ర్బారులో గౌరవభాజనమ్ము
సీరా లేదెప్పుడు శ్రీరామచంద్రుని
వాసికెక్కిన మహాశాసనమ్ము
చేర లేదెప్పుడు సిరిసంపదలుగల్గి
తులుకుచుండెడి ధనికుల గృహాన
మార లేదెప్పుడు మాటమంతికినైన
పరిశుద్ధమైనట్టి పథమువీడి

అనృతమాడనట్టి యమృతంపుముద్దవై
గానకళకు జంటితేనె వగుచు
మంత్రశాస్త్రమునకు మఱి జ్యోతిషమునకు
నిలయమైన నీకు వలపుజోత.

అల ప్రాచేతసు డా రఘూద్వహునిచర్యన్ కావ్యరూపమ్ములో
నిలువంబెట్టినరీతి నీవు రససంగీతార్ణవమ్మందు ని
శ్చలతత్త్వమ్మన రామచంద్రుని ప్రశస్తంబైనచర్యన్ మహో
జ్జ్వలమౌ మేల్‌కృతులందు నిల్పితివి విద్వన్మూర్తి! త్యాగాహ్వయా.
నీ మహితైకతత్త్వకమనీయహృదంతరవీథిలోన శ్రీ
రామునిసన్నిధానమును రాగమెలర్ప ప్రతిష్ఠజేసి స్వ
ధామము దింపినాడ వవురా! మధురంబగు గానసత్కళా
గ్రామణి! నీవుపుట్టువు పురాకృతభాగ్యము తెల్గుజాతికిన్.

దిట్టరైన ముత్తుస్వామి దీక్షితులును
స్వాతి తిరునాళ్ మహారాజు శ్యామశాస్త్రి
నీకు సమకాలికులగు సంగీతనిధులు
నీయదృష్టమ్మె నాడు పండినది యటుల.

వర్తించు నిచ్చోట నయమార నీ మహా
గేయ మాధుర్య సంగీతలక్ష్మి
వర్తించు నిచ్చోట పరమపూజ్యంబైన
నీ సత్యజీవన నీరజాక్షి
గుర్తించు నిచ్చోట గురుతరబంధమ్ము
లెసలారు నీమంత్రి స్మృతులశక్తి
కీర్తించు నిచ్చోట గేయకారులవాణి
ధన్యమై వెలయు నీ పుణ్యచరిత

సారధీరమతివి ! కారణజన్ముడంశ
వీవు నేటియుగపు ఋషివి నీవు
మాకు నయినవాడ! కాకర్లకులపూజ్య
అమృతగానతేజ ! త్యాగరాజ !

పరచెన్ రాగరసాల చాందినులు విశ్వంబెల్ల నగ్గింప నీ
"తిరువైయూరు"న గాయకోత్తములతో తీర్థమ్ముగా వెల్గి సం
బరముల్ నేటికి సాగునచ్చట కృతిబ్రహ్మ! మహామాన్య! నీ
చరితం బెంతటిగొప్పదో తెలియగా జాటించు ముమ్మాటికిన్.

ఎడదలో త్యాగాంశమడుగుపెట్టగ రాజ
భోగమ్ములను త్రోసిపుచ్చునాడు
బుఱ్ఱలో రామయ్య యుఱ్ఱూతలూగగా
నుంఛవృత్తికి స్వాగతించునాడు
పార్వతి కమలాంబ భార్యలు మరణింప
వైరాగ్యపదవి చేపట్టునాడు
అనుకొన్న దేవాలయముల గాంచుచు నందు
దేవతాళికి మ్రొక్కు తీర్చునాడు

నీ మహోన్నత భక్తికి నీయనంత
మహిత సంగీతకృతులకు మాన్యభావ
నా పరంపరలకు తెల్గునాడు నేడు
తనివిసెందుచు హర్షించు త్యాగరాజ !

పలికించితివి గుండెలలర తంబురమీటి
బంగారమైన తెలుంగు కృతుల
చిలికించితివి భక్తి వెలయగా మధురగా
నమున నక్షయమైన నాదసుధల
మొలిపించితివి జగన్మోహకంబుగ మాన
వాళి హృత్సీమ భక్త్యంకురాల
నిల్పించితివి దిశావలయభిత్తికలపై
తెలుగువారల యశోదీపమాల

స్వచ్ఛమైన తెలుగుసాహిత్యమున కృతుల్
రచనజేసి భువనప్రజల కిచ్చి
ప్రబలుచున్న తెలుగువాగ్గేయకారకా !
త్యాగరాజ ! నాజోహారు లివిగో.

నీ నిర్యాణపువేళ నీవెతిగి యంతేవాసులంబిల్చి యీ
గానానందసుధాఝురీలహరి ముక్కాలాలు పాటింప వి
శ్వానన్ భారము మీదెయంచనిన డెబ్బెయేడువర్షాల తం
డ్రీ ! నీగానము మ్రోగుచున్నది ధరిత్రిన్ కోటికంఠాలతో.

15-3-1983

# వీరబ్రహ్మము

మాఘ కార్తీక వైశాఖ మాసమందు
పోతులూర్వీరబ్రహ్మ! నీ పుణ్యచరిత
తన్మయతను కాలజ్ఞానతత్త్వములను
పాడుకొందురు భక్తులీనాడుకూడ.

కడపనవాబు నీమహిమగాంచి సలామొనరించి యెన్నియో
యుడుగరలిచ్చి నీదు మధురోక్తుల వైఖరిమెచ్చి సంతసం
పడుట త్వదీయశక్తికి నిబద్ధమహత్తర యోగదీక్షకున్
సడలని దేవతాంశకు యశఃపరిపూర్ణయు దాహృతంబగున్.

ఉగ్రతపశ్శక్తి నుచ్చరించినతోనె
పెనుతాయిధామ్మంచు ప్రేలునాడు
మనసుమారిన మహామాతంగ కక్కయ్య
చెలిని ప్రేముడిని రక్షించునాడు
తెరవాటుగాండ్ర దబ్బరమనస్సులలోన
ప్రేమాంకురములు స్థాపించునాడు
వటవృక్షశిఖరాన వసియించు బ్రహ్మరా
క్షసికి స్వస్థత నియ్యగలుగునాడు

ధ్యానమానసమున జ్ఞానోపదేశమ్ము
తమినిపెంచినట్టి తల్లి కెలమి
బోధసేయు నీకు పుట్టెడుజోదిల్లు
సారచరిత! పోతులూరికులజ !

పీరుసాహేబులాడంబి ప్రియసుతుండు
పదియునాలుగువర్షాల వయసువాడు
గురువుగా నిన్నుబూజించి కఱచె బ్రహ్మ
విద్య సిద్ధయ్య యెంతటివేత్తయొకో !

భగవదంశమ్మె నీలోన పాదుకొనగ
నీవు భగవానురూపాన నెగడుకతన
నద్భుతములను నీవు సేయగలిగితివి
ధన్యుడయ్యె వీరబ్రహ్మ! ధాత్రి నిజము.

ప్రమదమున నమ్మతోడ నర్థాతలగూర్చి
నుడివినాడవు నీలోన నడరు భావ
ములను భవితవ్యమునుగూర్చి తెలిపినావు
సత్యమిది వీరభోగ వసంతరాయ !

ప్రేమైకదృక్కుల రెడ్డివచ్చియమ్మ నం
దనునికి నేత్రదానమ్మె సేసి
బనగానపల్లినవా బిచ్చినట్టి యా
తిథ్యమ్మునన కెదురుదెబ్బగొట్టి
మహిమజాటగ కొండగుహాలోననుండి కా
లజ్ఞానతత్త్వంపు రచనసలిపి
పశువులన్నియుగూడ బరిదాటకుండంగ
పాటించునట్టుల గీటువెట్టి

నీ క్షుధార్తిగాంచి నెనరుతో నా రసా
లధరణిజము వంగ మధురఫలము
లారగించి ప్రజలకల్లన మోక్షబో
ధనము సేయునీకు ప్రణతి యగుత.

అబ్రమ్మయ్యెడి నీచరిత్రము గదయ్యా! పోతులూర్వంశ వీ
రబ్రహ్మఖ్యా! పఠింప నిది యవతారంబౌను తథ్యమ్ము నీ
వీబ్రహ్మాండము నుద్ధరించుటకె నీ వీలాగు జన్మించితో
నీ బ్రహ్మత్వము జోతలందికొనియెన్ విశ్వప్రపంచమ్ము చే.

కలియుగమందు భూస్థలిని గల్గు విశేషములెల్ల నీదు భ
క్తులు తెలియంగచెప్పుటలు కొన్నిశతాబ్దులు దాటిపోయె నీ
పలికినయట్లె యన్నియును ప్రస్ఫుటవైఖరి సాగుచున్నవి
య్యిల భగవానురూపుడవు సృష్టికి జాగృతినియ్య వేడెదన్.

దొంగలచెల్మికాడొకడు తుంటరి చచ్చినవేళలోన నీ
ముంగిలి వాసిబందుగులు మ్రొక్కులువెట్టుచు వ్రాల నాడు వా
నింగరుణించి లేపితివి నీమహిమాన్వితశక్తి యెట్టిదో
వెంగలు లేమెఱుంగుదురు విశ్వజనోద్ధరణైకతత్పరా!

నిను దర్శించిన సిద్ధయాభిధునకున్ నీ దర్శనంబిచ్చి శి
ష్యునిగా జేకొని బ్రహ్మవిద్యలను తానూహింపలేనన్ని చె
ప్పిన నీసద్గురునామధేయము జగద్విఖ్యాతమైపోల్చ నీ
యనుకంపామతి యిట్టిదె వెలయు నయ్యా! నాటికీనాటికిన్.

భక్తిప్రపత్తితో భక్తులీనాటికి
నరుదెంత్రు కందిమల్లయ్యపల్లె
నాటి సద్గోష్ఠులు నేటికిన్ గూడ సా
క్షాత్కారమిడును ముచ్చట్లకొండ
సంతసంబిడు పర్ణశాలావరణములో
తీపిదసంబిచ్చు వేపమ్రాను
కాలతత్త్వగ్రంథ ఘనమైనపాతర
చెప్పిచూపించెడు చింతచెట్టు

నీ యఖండతపసు కీయజాండమునందు
చెఱగిపోనియట్టి చిహ్నితములు
సహానచరిత ! విశ్వవిహిత ! వీరబ్రహ్మ !
నీ యమోఘువాక్కు నిలిచిపోయె.

క్రమముదప్పి నీతిరాహిత్యమునబోవు
నుద్ధతి ప్రపంచ ముద్ధరింప
వుట్టవలయు వీరభోగవసంతరా
యనిగ నీవుచెప్పినట్లు నేడు.

23-10-1983

# రాఘవేంద్రస్వామి

అన్నా! తిమ్మన గోపమాంబలకుమారా! రాఘవేంద్రా! దయా
స్విన్న స్వాంత! మహోగ్రపాపపటలీజీమూత ఝంఝూకృతీ!
పున్నంబైన భవచ్చరిత్రము ముదమ్మున్ నేపఠింపన్ రచిం
పన్నా నేరిచినట్టి యీసుకవితామాల్యమ్ము గైకోగదే!

స్వామీ! వేంకటభట్ట! వేదములు సర్వగ్రంథశాస్త్రావళుల్
నీమేలైన సుధారసోల్బణసమున్మేషంపు జిహ్వాస్థలిన్
ధీమాచాతురి నాట్యమున్ సలుపు నీధీశక్తి వాగ్ధాటి స
ప్రామాణ్యమ్మున కిచ్చుటన్ నిలిచెబో ద్వైతమ్ము తర్కింపగన్.

నీపూర్వుల్ జగదేకపండితులు వాణీసత్కటాక్షాంచల
శ్రీపారమ్యవినోదు లార్యవినుతశ్రేష్ఠుల్ యశోభూషణుల్
నీపాండిత్యసుధల్ సుధీంద్రులకు గల్పించెన్ మహాగౌరవ
శ్రీపట్టమ్ము జగమ్మునందున తపస్వీ రాఘవేంద్రాహ్వయా.

గురుడే యబ్బురమందె నీదు రచనాగూఢార్థముంగాంచి నీ
యురుదీక్షాపరతన్ప్రశస్తికి నెదేదో యూహలందించి యు
ర్వర నిన్నున్ తనయంతవానిగను సల్పన్ ప్రజ్ఞగైకొన్న త
చ్చరితంబెంతటిగొప్పదో పరిమళాచార్యా! యెదన్నాటెబో.

నిప్పానుబోలు నీగుణము నీకు సుధీంద్రులవారు శాలువా
కప్పినసంగతిం దలపగా నదియెంతటి గౌరవమ్మొకో
యప్ప! భవత్ పురాకృతమహాసువిశేషము చెప్పకోగ నీ
తప్ఫల విశ్వధారుణికి ధర్మపథమ్ము భవత్ప్రబోధముల్.

తనతరువాత పీఠముకు తప్పక నెక్కఁగలట్టికక్తి నీ
కును గలదంచునమ్మి మునికోవిదులైన సుధీంద్రులేమిచే
సినఫలమో లభించినది చెప్పఁగనీకది రాఘవేంద్ర! యీ
తనువులు పులకరించినవి ధన్యములైనవి జీవితమ్ములున్.

నీతాతల్ గడుభాగ్యవంతులు సదా నిష్ఠాగరిష్ఠాత్ములై
ప్రీతింగొల్చిరి మూలరాముని సుఖశ్రీలంది నీతండ్రి బా
ధాతప్తుండయి సాకె నిన్ననొగి నాదైన్యమ్ము వెంటాడె ని
న్నోతండ్రీ! యిది యేమిచిత్రమగునో యూహింపయోగీశ్వరా!

కూడు గుడ్డకొఱకు కుములుచు నొకవంక
కఠినదీక్ష జదువగలిగినావు
పేదఱికము ననుభవించి నీజన్మసా
ర్థకత జెందె స్వామి! రాఘవేంద్ర!

ప్రాయమునందు చిన్నవని స్వాంతమునం దలపోసి యజ్ఞనా
రాయణ దీక్షితుండు మఱియాదలెఱుంగని పండితుండు నీ
స్థాయి నెఱుంగలేక నుడిజాటిజయమ్మును గోలుపోయె స్వా
మీ! యిది నీగుహూత్తమునికెంత యశస్సురహించెనో కదా!

శిష్యవ్రాతమునందు నీకొకరికే శ్రీవారు ప్రేమన్ మహా
భాష్యాచార్యుడటన్న మేలిబిరుదున్ వాగ్మి! ప్రసాదింపవై
దుష్యమ్మెంతగ గౌరవింపబడెనో దోషజ్ఞ! కాన్పించు నే
దూష్యంబున్ దరిజేరనీయని మహాత్ముండీవ ముమ్మాటికిన్.

మూలరాముని దేవుని పూజజేసి
ఘనయశమ్మును లోకాన గాంచినావు
గురువు శ్రీసుధీంద్రులవారి కరుణవలన
నుహిమలను చేసినాడవు మానసియ!

జిహ్వలో నాదిగెనా శ్రేష్ఠతానిధులైన
వేదవేదాంగాల విమలవిద
మనసులో దాగెనా కొనలుసాగినయ
షట్శాస్త్రపాండితీసౌరభమ్ము
కంఠాన సాగెనా త్యాగదిశల్ పులకింప
కమనీయ గాంధర్వ గానగంగ
వ్రేలలో నూగెనా విశ్వమోహనముగా
ధ్వనులువలికిన యమృతంపువీణె

విన్న నాశ్రయించి నిండారుపూజల
నందుకొనగలేదె ? యగ్ని వరుణ
సూక్తవితతి మంత్రశూర ! మహాధీర !
రమ్యసుగుణసాంద్ర ! రాఘవేంద్ర !

చదువున్ సంస్కృతికిన్ పసందుప్రతిభాసంపత్తికిన్ దారిలే
దిది మామూలయిపోయె లోకమున స్వామీ! నీకుటుంబమ్ము గా
ఢదరిద్రాగ్ని ని గ్రుగ్గిపోవుటలు చూడన్ మానవత్వమ్ము లే
నిదిగా గాకమురేమిచందముగ గన్పించున్ జగంబంతయున్.

మరణించి దయ్యమై తిరుగాడు నీసతి
బంధమ్మున విముక్తి నెందువేళ
అవమానపరచిన యసదుల్లఖాను నీ
చరణనీరేజాల కెఱగువేళ
పసులకాపరియైన బాలుడు వేంకన్న
నీవల్ల జ్ఞానియైనెగడు వేళ
కనకదాసులు మాదిగకులస్థు డిచ్చిన
యావాలు ప్రీతిమై నందువేళ

ప్రేమమూర్తివైనస్వామి! నీకారుణ్య
భావమునకు మానవత్వమునకు
మంత్రయోగమునకు మధ్వసిద్ధాంతప్ర
వక్త ! రాఘవేంద్ర ! ప్రణతిశతము.

అమితోత్సాహముతోడ నేరిచెనె? విద్యాసక్తిమై సాహితీ
సమరప్రాంగణసార్వభౌము డురు భాషాపోషకుండౌను డెం
దముపొంగారగ కృష్ణభట్టుకడ వీణావిద్య నీతాత యు
త్తమవిద్యానిధి ! నీదు వంశసుచరిత్రంబెంత విఖ్యాతమో?

ఓయీ ! గౌతమగోత్రసంభవ ! జగంబుట్టూతలూగెన్ ప్రజా
శ్రేయోదాయకమైన నీపనులకున్ చిత్తాన నీదేశకుం
డే యాశ్చర్యముపొంది మెచ్చుకొనె నీయాప్రజ్ఞకున్ వ్యాఖ్యకున్
నీ యుద్ధోరు యశఃప్రదీపికలు నిండెన్ విశ్వవిశ్వంభరన్.

అల ప్రహ్లాదుని యంశమ్ము వ్యాసరాయ
లతని యంశమ్ము బాహ్లికక్షితిపతీంద్రు
డతని యంశమ్ము నీదట యనెడుమాట
సాక్ష్యమిచ్చును స్వామి ! నీచరితయందు.

కుంభకోణములో విజృంభించి వాదాన
ద్వైతధ్వజ మెగురవైచునాడు
ద్రవిడసన్న్యాసి నీప్రతిభావిశేషమ్ము
నెదమెచ్చి జయపత్ర మిచ్చునాడు
ప్రతిలేని వాదనాబలముతో శైవపం
డితుల డీకొంచు నోడించునాడు
ధనవంతునింట గంధమును తీసినవేళ
పండితుల్ విభ్రాంతి పడిననాడు

నీమహత్వమెట్టిదో మహనీయ ! వా
రలకు తెలిసె నాడు రాఘవేంద్ర !
సిద్ధపురుషుడవు ప్రసిద్ధమంత్రోపాస
కుడవు గోపమాంబ కూర్మిబిడ్డ !

అలఘుల్ నీగురుదేవులౌ యల సుధీంద్రాభిఖ్యు లవ్యాజవ
త్సలతన్ పీఠము నీకొసంగిరది శాస్త్రామోదసారమ్ముగా
నిలిచెన్నేటికి నీయదృష్టమది పండెన్నాడు శ్రీయాదవేం
ద్రులవా రెంతగ నిన్నుమెచ్చుకొనినారో తెల్పశక్యంబొకో !

నిలువెల్లన్ దయతో మునింగిన మహానీతిజ్ఞుడౌ యాదవేం
ద్రుల దీపీఠము నీకుసబ్బినది వారున్నిన్ను కొండాడినా
రలు నీప్రజ్ఞకు నీ వినమ్రతకు నార్ద్రింబైన నీ ప్రేమవా
క్కులకున్ పొంగిరి సాటిలేరవని నీకున్ రాఘవేంద్రాభిధా !

మహిమచెల్వార నీమంత్రసేచనముచే
బ్రతికినాడుగదా ! నవాబుకొడుకు
వెలయు నీకారుణ్యకలన లేచెనుగదా !
మృతినుండి దేశాయిప్రియసుతుండు
అన్ననీమాట వేంకన్నపంతులు నిల్పి
నాడుగదయ్య ! బృందావనమ్ము
తీర్చినాడుగదా ! నుతించి నీయాశయ
మాంగిలేయ కలెక్టరైన మన్రో

ఆత్మ నిన్నుగొల్చి రప్పణాచార్యులు
శ్రీనివాసతీర్థులైనవారు
స్వామి ! నీమహత్వశక్తిని తిలకించి
శ్రేష్ఠులైన భక్తశిష్యులైరి.

ఈ మంత్రాలయపుణ్యభూస్థలికి స్వామీ ! కల్గె నీనాడు పూ
జామర్యాదలు నీతపఃఫలిత మీచందాన రూపొంది భ
క్తామోదమ్ముగ సాగుచుండుటలు మోక్షద్వారమై వెల్గు నీ
భూముల్ నీమహితప్రభావమునకున్ పాల్పొందుచిహ్నంబులౌ.

**25-12-84**



# స్వాతంత్ర్య సందేశము

పగసెగల్ రేగిన పంజాబులో శాంతి
వీచికాతతి తాండవించుదాక
అల్లకల్లోలమధ్యను జిక్కి నస్సాము
బ్రదుకులో నమృతమ్ము జిదుముదాక
జనఘర్షణమున నల్గినయట్టి జమ్ముకా
శ్మీరాన సహనమ్ము సెలగుదాక
మతవర్గభేదాలు మసలు భివాండిలో
ప్రేమగంధము గుబాళించుదాక

ఎల్లెడల యశాంతి కిల్లైనదేశాన
కూర్మి పేరిమి నెలకొన్నదాక
స్వేచ్ఛ లేదు భరతసీమకు నీనేటి
స్వేచ్ఛ స్వేచ్ఛగాదు చెప్పికొనగ.

వేదికలెక్కి యభ్యుదయ వీరనివేదికలన్ పఠించి మా
మాదిరిపార్టి దేశమున మచ్చునకైనను కానరాదటం
చేదియె సోదెచెప్పు గుణహీనులు పాలనసేయు భూమిలో
లేదు స్వతంత్రతారమకు లేశముస్థానము సిగ్గుచేటగున్.

మత్తుమతాల ద్వేషములమధ్యను తాల్మి నశించిపోవగా
నెత్తుటినిర్ఝరిన్ మునుగు నేర్పరులున్నధరిత్రిలో క్షమా
వృత్తిని బోధచేసిన ప్రవీణుడు బాపుజి సత్యవాక్కుకున్
చిత్తముమాప దీభరతసీమయు స్వేచ్ఛకు నర్థమేమిటో ?

నాల్గుదిశల్ గలట్టిభువనమ్మిది భారతభూమి యంతటన్
మూల్గులె రక్తపాతములె ప్రోన్నతమానులుచెప్ప ప్రోక్తపున్
వెల్గులపాతరల్ నిజము వెఱ్ఱిదియైనిలుచున్న దేశమం
దీల్గుటయే స్వతంత్రమని యెన్నగవచ్చు నుదాహరించినన్.

మేలిమిమేడయయ్యెను సుమీ! యరుదెంచిన యీస్వతంత్ర హే
రాళ మహామహీతలము కాలకు గౌరవమబ్బునట్లు కూం
డాలకు త్రాగుబోతులకు నాడెపుసంస్కృతిలేనియట్టి చం
డాలుర కెందుకిట్టి భువనానకు స్వేచ్ఛ గ్రహింప గల్గినన్.

'డర్టి'భావనతో ప్రజావళిని నాటాడించు వారాభాగ్యపున్
'పార్టిదేశము' నేలుచో ప్రగతియబ్బన్ సాధ్యమే? స్వార్థపున్
'హార్టు'న్‌గల్గినవారు సేయునది శూన్యంబౌను తర్కించినన్
'పార్టి'లే కులకక్షలే మఱి దగాభావాలె పెంపొందెడిన్.

ముప్పదియెన్మిదేండ్లు ఋషిభూమికి నబ్బినస్వేచ్ఛలోన నే
గొప్పయులేదు కొంచె మదిగో కలదన్న నదేమిగొప్ప? యా
గొప్పకు బాపుజీయనెడు కొండొకపుణ్యుని త్యాగశక్తి లే
దిప్పుడు వానిశక్తి నశియించెను దోపిడిగాంగ్రెస శక్తిచే.

తనప్రాణమ్మునునైన దేశమునకున్ త్యాగమ్ము గావించుటే
ఘనుడైనట్టి మహానుభావుడు మహాగాఢేచ్ఛమా వాంఛగా
తనివిం జెందను నేడు మృగ్యమగు నాత్యాగమ్ము సంపాదన
మ్మున నెవ్వాడు వరిష్ఠుడో యతడె సంపూజ్యుండు చింతింపగన్.

ఆశ మఱింతగా బలిసి యైనది కానిది నాదెయంచు పే
రాశనుమున్గి నావలెనె నంతయు సాగుచునున్నదంచు నీ
దేశము నేనులేనియెడ దిక్కును మొక్కును లేదటన్నచో
నాశనమైన పద్ధతిని నడ్చును దేశముకుద్చు దుఃఖముల్.

పరిపాలకుడు ప్రజావళిపట్ల నెల్లప్డు
చిత్తశుద్ధిని ప్రదర్శించునాడు
అనయమ్ము నిఱుపేదజనులకు చౌకగా
నాహారవస్తువు లందునాడు
వంచింపబడునట్టివాడు. హర్షింపగా
సంఘాన న్యాయమ్ము జరుగునాడు
నరులందఱును సహోదరు లన్నభావమ్ము
ప్రతివాని యెడదలో నతుకునాడు

స్వర్గమే వ్రాలు నాడు భువనమునందు
నాడు స్వాతంత్ర్యదినము నందనమె యగును
పరమసమతాసమైక్యస్రవంతు లెపుడు
నింకిపోవక నట ప్రవహించుచుండు.

29-7-1984



# అఖండభారతము

ఇది నాశీతలధారణీధ్రము శివుం డిచ్చోట నా గౌరితో
పదముల్ వైచి నటించి తాండవము సల్పంబూను సర్వంసహా
భ్యుదయమ్మో మఱియేమియో యదియ దేవుం డే యెఱుంగున్ బదా
బదలై నట్టి జనాళికయ్యెడిని దివ్యద్భోగభాగ్యోన్నతుల్.

ఆ తెలిదమ్మిగద్ది యొకయాసనమందున కూరుచుండి యే
దో తిరకాసుపెట్టి భువితోడ నసహ్యపు టాటయాడు నా
ధాత సరస్వతీసతికి ధాత యతండొసగున్ పసందుగా
ఖ్యాతివహించు భాషణ మనర్ఘముగా మనుజాళికెప్పుడున్.

చిచ్చరపిడ్గు శత్రులకు చేతులుమోడ్చినవారికెల్ల సం
పచ్చయమిచ్చు నా గరుడవాహను డీజగతీతలానకున్
బిచ్చముగాక తా నమృతభిక్షము వెట్టి సమాదరింప దా
లచ్చికి నచ్చచెప్పెడిని లప్పలతో నిల నుల్లసిల్లగన్.

ముగ్గురమ్మల్ సదయాత్మలై మనుచుతన్ ముప్పొద్దులన్ బేర్మిమీ
రగ నీవిశ్వమునెల్ల శాంతిసౌఖ్యములతో రంజిల్ల నేలాటి దు
ర్భగవాతారణమ్ము నిల్పక దరిద్రంబైన మూర్ఖత్వపున్
పొగలన్ జిమ్మగనీక నోమెదరు మాభూఖండసామ్రాజ్యమున్.

మునుల తపోవిధానములు మూడుజగాల దనింపజేయజా
లినయెడ నేమికావలయు లేమినశించు నుదారవైఖరీ
ధనము లభించు నెప్పుడును తప్పక శాంతిచరించు భారత
మ్మున సమతామహోన్నతప్రమోదప్రసూనము లప్డుపూచెడిన్.

ఈ గంగానది బ్రహ్మపుత్రయును నీ కృష్ణమ్మ కావేరియున్
ఈ గోదావరి, సింధు, నర్మదలు నా యీదేశసౌభాగ్యధా
న్యాగారాలకు పట్టుగొమ్మలు నఖండంబైన నాధారుణీ
భాగ మిమ్మసకలప్రపంచమునకున్ స్వామిత్వముం బూనెడిన్.

వాడెన్ నిశ్చలధైర్యచిత్తమున మాబాపూజి సచ్ఛాంత్యహిం
సాడమ్మారము జాతిజాగృతికి స్వేచ్ఛాజీవన మ్మిండియా
వాడల్ వాడలు నిండుగా నలమగా భావేకతాగంధపున్
జాడల్ మెండుగవెల్గ జాతికి సదృష్టంబిద్ది వాక్రువ్వగన్.

ఈకొఱగానివర్ణముల వృత్తులభేదము లేర్పఱించి యీ
లోకము చీదరింప నొకలుంతకు డాతని శేయిచట్టపున్
పోకడ లిప్డుగానబడు నూతనసంస్కృతి సూర్యతేఁపున్
శ్రీకిరణాలు క్రమ్ముకొన నేడవిచూడ దిగాలు చెందెడిన్.

తూలున్ సోలుచుగర్వచిత్తముల నెంతోమంది భూభుక్కు లీ
నేలన్ శ్రీపాలనచేసినప్పటికిగానీ యారిపోలేదు వే
దాలన్ వెల్గులగూటిలో నిలువు విద్యాదీప విరావేళ క
ల్లోలక్షోణిని పారద్రోలెడి క్రుళ్ళుంగుట్రచీకట్లునున్.

ఈవేదాంతమహౌఘనీలహరిలో నీతాడి కై పెక్కి యీ
జీవాత్మన్ పరమాత్మవైపునకె సూచింద్రిప్పు తత్త్వజ్ఞు లా
రా ! వేవేలకొలంది భారతములో వ్యాపించియున్నారు లా
త్రోవల్ గిట్టనివారుకూడ గుణసింధుల్ దేశభక్తాగ్రణుల్.

దేశభక్తి మఱియు దేశసమగ్రత
ప్రజల నాడులందు ప్రబలిప్రబలి
కర్మభూమియగు నఖండభారతమహా
క్షితిని నెగురు ప్రగతికేతనమ్మ.

దిరుసుల్ మార్చినయట్లు కొందఱిట జాతిద్రోహులై మార్చుచుం
దురు పార్టీలను దేశభక్తికిది యెంతో ద్రోహమే యౌను కొం
దఱు కాదందురు దేశభక్తియని వంతల్ పాడగా సాహసిం
తురు దీనిన్ సవరించుచో ప్రజలు సంతోషింతు రీనాడులో.

1-11-1983

# సందేశము

పరమతపోనివేశనము బంగరుపంటలకున్నివాస మ
బ్బురమగు శాంతిచంద్రికలభూమి ప్రపంచచరిత్రలోన బం
ధురతరకీర్తిగొన్న భరతోర్వర నాజననియ్రిత్రియంచు బా
డర! శిరమెత్తరా! విజయఢంకను గొట్టుమురా! సహోదరా!

ఇదినాదేశము నన్నుగన్నయది నా యీదేశసౌభాగ్యసం
పద లీవిశ్వమునందు వర్ధిలిగ తోడ్పాటున్ పౌనర్తున్ మహా
భ్యుదయమ్మున్ నెలకొల్పుదున్ భువనముల్ పూజింపనం చీవు నీ
మెదలో గట్టిప్రతిజ్ఞగైకొనుమురా! హిందూకుమారాగ్రణీ!

జాతి శిరస్సునెత్తికొని ఛూస్మతలవీధిని గౌరవాన హుం
దాతనమొప్పగా తిరిగినన్ కలుగున్ కడుకీర్తి భారత
ఛూస్మతలి కట్టిభాగ్యమునుగల్గగ శాంతిసముద్ధరింప లే
రా! తరుణమ్మిదే మరలరాదుసుమీ! గతకాల మెన్నడున్.

మతమేదైనను భాష యేదయిన సంపాదించుకొన్నట్టి సం
స్కృతి యేదైనను నిండునీతనువులో జీర్ణించు జాతీయతా
హితనవోజ్జ్వల భావబంధురత లీహింసాప్రపంచాన క
ద్భుతరీతిన్ గనిపింపగావలయు బాబూ! శాంతి దీక్షారతా!

నిఖిలధరణికి శాంతిని నేర్పినట్టి
భరతభువనమ్ము నీతల్లి ప్రథితయశము
నిలువబెట్టుట నీవంతు నిశ్చయముగ
నీకుగలదు బాధ్యతయు హిందూకుమార! 5-11-1983

# స్వేచ్ఛా దినము

రుధిరంబున్ గొదవెట్టి యాంగ్లవిభులన్ రోధించి స్వాతంత్ర్యసా
రథిగానిల్చిన బాపుజీకనిన స్వర్ణస్వేచ్ఛ, దేశానక
ప్రథగా బొల్చిన యీమతాలగొడవల్ వర్ణాలవిద్వేషసం
గ్రథనాలన్ పరిమార్చు మోభరతవీరా! దేశదీక్షావ్రతా !

తలపన్ ముప్పదియెన్మిదేడుల స్వతంత్రంబందు దైన్యప్రజా
వళికిన్ కల్గినదేమి ? ముబ్బడిగ తిప్పల్ తప్ప పాలించువా
రల సౌఖ్యాలకు లోపమేమిటి? యధర్మం బీ మునిక్షోణికిన్
అలవాటైనది మాన్పగావలయు నయ్యా! దేశభాగ్యోదయా !

ప్రవహింపగావలె పంజాబునేల న
        జస్రమ్ము శాంతిసుధాస్రవంతి
అలరింపగావలె నస్సాము సీమను
        నోరిమిన్ జనపరిష్కారసరణి
నిండింపవలయు భివాండిప్రాంతమ్ములో
        పృథులైకమత్య పరీమళమ్ము
చెలగగావలయు కాశ్మీరభూభాగాన
        కమ్రభావ స్నేహగాఢకాంతి

దిక్కులేక దెబ్బతిన్న పంచములకు
గుండెలోన నవ్వు నిండవలయు
నచ్చముగను నాడు స్వేచ్ఛాదినమ్మురా !
కాదె ? యస్వతంత్రతాదినమ్మె !

ముసలిసన్న్యాసి బాపుజీ బోసినోరు
విప్పిపలికిన పలుకుకే విశ్వజగతి
జోతలర్పించె జాతికిఖ్యాతి యదియ
ఆ మహోమానినేల పాడయ్యో నేడు.

శిరమెత్తరాదు మచ్చరకించి విషపుదా
ర్జన్యకులమతహింసా పిశాచి
నిలువగారాదు పెన్ బలిసిపోయిన దుష్ట
నయవంచకాళి గూండాయిజమ్ము
తొలచగారాదు విద్రోహన దేశభా
గ్యాల దార్ఢ్యతను లంచాలజలగ
వచియింపగారాదు ప్రతినిధి యగువాడు
పగనసల్ మొలకెత్త పలుకుబడులు

అంద అన్నదమ్ములన్న మధురమైన
ధర్మమునకు దెబ్బ తగులరాదు
నాడురా! స్వతంత్రతా డిండిమము మ్రోగు
వసుధపొగడ నవ్యభారతమున.

30-7-1984

# సంక్రాంతి

అంతుంబొంతునులేని సంతసము నైక్యస్నేహబాంధవ్య సి
ద్ధాంతమ్మున్ సమతాస్వభావమును స్వార్థత్యాగమున్ ధర్మపుం
చింతన్ తెల్గులగుండెలం దెపుడు నిండింపించి చైతన్యపున్
కాంతిశ్రీపథమందు నేగగను సంక్రాంతీ ! ప్రబోధింపుమీ.

తనమార్గంబెదో నిర్ణయించుకొను సత్తాకల్గు నాతెల్గువా
నిని యేశక్తియు లొంగదీసికొన యత్నింపన్ వృథాయాసమౌ
నని వాక్రుచ్చుట తప్పుగాదనుచు డెందానన్ తలంతున్ నిజం
బును సంక్రాంతిసతీ! యెలుంగుదుపుగా మోదమ్ము నిండింపుమీ.

తలపన్ బెట్టుకు కోడిపుంజుల తగాదాలోన మాతెల్గువీ
రుల శౌర్యమ్ములు మాసిపోయినవి కూర్కుంజెందె చైతన్యదీ
ప్తులు పూర్వమ్మున నేడుమేలుకొని దిగ్భాముల్ ప్రశంసించుచే
తలు సంక్రాంతియొనర్ప మాకవి యమందానందముం గూర్చెడిన్.

క్రమమున్ తప్పని నీదు రాకడకు సంక్రాంతీ ! మనుష్యాళికిన్
క్రమతన్నేర్పుత మీదినానగల సింగారమ్ము బంగారమై
ప్రమదంబిచ్చుత తెల్గుజాతికి నవౌజ్జ్వల్యంపు భాగ్యాలు ని
త్యము చిందాడుత సంకురాతిరి త్వదీయంబైన వేళంబడిన్.

నా తెల్గుబాల యందముగపెట్టిన ముగ్గు
నా సంస్కృతికి ప్రధానప్రతీక
నా తెల్గుబాలుండు ప్రీతిమై ధరియించు
వస్త్రమ్ము నాజూకుపధము దెలుపు
నా తెల్గుజంగమన్న కపర్ది వేషమ్ము
తెలుగువారికి భక్తిదీపరేఖ
నా దాసరయ్యకంఠాన మ్రోగినవాణి
నాజానగీతికి నవ్యసూచి

నా తెలుంగుజాతి నడచుమార్గము విశ్వ
ధాత్రికెల్ల మార్గదర్శకమ్ము
నీకు స్వాగతమ్ము నీరాజనమ్ము సం
క్రాంతి చిమ్మవలె వరాలకాంతి.

4-1-1985



# కుంభాభిషేకము

దేవతలుమెచ్చ సాగరతీరమందు
మంగళాంబికా సహితుడై మసలునట్టి
ఆదికుంభేశ్వరుని ప్రగాఢాశిషమ్ము
భక్తజనులకు కలుగుత ప్రతిదినమ్ము.

ఎవ డీజీవులనెల్ల నిత్యము కృపాదృష్టిన్ కటాక్షించి యీ
భువనంబందున గాచుచుండు ననిశంబున్ లాభమాశింపకే
ఎవడో? యాతడె! చూచిసంతసిలు నే డీయాది కుంభేశ్వర
ప్రవణౌజ్జ్వల్యవిశిష్టయజ్ఞమును విశ్వక్షేమ మాశించుచున్.

ఈ యాగా లభిషేకజృంభణము లేవీ? నేడు చల్లారిపో
గా, యజ్ఞాంశముగల్గు సీశ్వరుని భక్తశ్రేష్ఠుడొక్కండు తా
నై యాత్మందలపోసి చేయుటకు ధైర్యంబున్ ప్రదర్శింపగా
ఈ యాగానకు దారికల్గినది కాదేన్ భక్తిమార్గంబెదో !

శాంతిశ్రీలకు సౌఖ్యసంపదలకున్ సన్మార్గభావాల కా
ద్యంతమ్మై తనరార భక్తిగుణతాదాత్మ్యమ్ము చేకూర్చు సి
ద్ధాంతమ్మున్ పెనవేయజాలగల దివ్యంబైన కుంభాభిషే
కాంతర్యమ్ము సమస్తమానవుల కాహ్లాదమ్ము గల్గించెడిన్.

కృషి ఫూరాగనోసర్పజాలని దశగ్రీవుండు దక్షుండు ను
న్మిషితంబై యతిపావనంబయిన శాంతింకూర్చు యజ్ఞమ్ములన్
ఋషివిసారన్ పొనరింపలే దపుడు ఘర్తున్ రామచంద్రుండు త
త్స్నపమాభాగ్యమహైకయజ్ఞమునకున్ జూపించె నే డధ్వమున్.

ఈశ్వరసన్నిభుండయిన యీ దినరాజు ప్రభాతవేళ స
ప్తాశ్వశతాంగమెక్కి యరుణారుణాకాంతులజిమ్మి యాదికుం
భేశ్వరు మేలుకొల్పిన యదృష్టము దక్కెను మాపురానకున్
శాశ్వతసత్యసత్యమిది సాగరతీరము సాక్ష్యమిచ్చెడిన్.

దేవతానీకమ్ము దిగివచ్చు నేడురా
మంగళాంబాస్వామి మహిమబొగడ
ఆదికుంభేశ్వరు పాదాలనీడలో
వినిపించు నేడురా వేదఘోష
సత్యలోకంబైన స్వర్గమ్ము నేలపై
వ్రాలుట నేడురా వాస్తవమ్ము
ఘనమునీశ్వరులు వాకొనిన పురాణాల
సారమ్ము నేడురా సంఘటిలుట

కొలువుదీరు నాదికుంభేశ్వరుకు మహా
వారిధీప్రపూత తీరమందు
శాంతియజ్ఞవేళ సర్వసౌభాగ్యాలు
మానవాళికిచ్చి మనుచుగాక !

తంతులకోసమై జరిపి ధర్మపునోటిని నొక్కివైచి సి
ద్ధాంతము గంగలోగలిపి ధాత్రికి కీడొనరించు యాగపున్
తంతులు రామచంద్రునకు ధారుణిలో సరిపోనిపద్ధతుల్
వింతయె యీవిధానములు విస్మృతిగాంచునుగాక ! యెప్పుడున్.

ఓయిశివా! మహోజ్జ్వలమహోన్నతమూర్తి! కపర్ది! శంభు! మా
కాయము లెంత? జీవనవికాసము లెంత? ధనమ్ము లెంత? ని
శ్రేయసమైన నీచరణసేవనమే కలిగించు విస్ఫురత్
శ్రీయు ప్రశాంతజీవన విశేషము లివ్వియ మాకు చాలుబో!

ఆనందాలను పొంగగా కుధరకన్యానాథ ! నీ దీవనల్
రానీ భక్తశిరస్థలాల పయి దుర్వారోగ్రపాపౌఘముల్
పోనీ నీతిగలట్టిచేతలు జనంబుల్ సల్పనీ ! పార్వతీ
జానీ! మమ్ముల మానవాళిని గటాక్షశ్రీల బోషింపుమీ !

అబ్బురమైన తొమ్మిదవయజ్ఞము నేడిటసాగె పాపపున్
మబ్బులలోన మానవులు మగ్గుట యేలని? యేర్పరించినా
రబ్బ! మునీంద్రు లాపథమునందున భక్తుడుసల్పె యజ్ఞమున్
గిబ్బసిపాయి ! రమ్మిటకు నీదగుభాగము స్వీకరింపగన్.

గుంపుల్ గుంపులుగాగ భక్తవరు లీకుంభాభిషేకమ్ము వీ
క్షింపన్ వచ్చినచందముం గనిన విశ్వేశా! జగద్రక్ష ! నై
లింపుల్ సైతము పొందలేని శుభముల్ చెల్వారపొందంగ న
ర్థింపంగాదె ! నిజానిజాలు జడదారీ ! దాచ శక్యంబొకో !

ఈశ్వర ! దుష్టచింతగల యీజగడాల జగాన కాదిసుం
భేశ్వర ! యేదిశాంతి? జనులెల్లరు నొక్కటిగా సమేకతా
విశ్వజనీనభావమున వేడుకమీఱ చరింపజేయుచో
నశ్వరమైన భూవలయమందున నూకలు నీకు పుట్టెడిన్.

22_11_1984



# రుధిరోద్గారి

ఒకచైతన్యసుధాస్రవంతి యిటులాంధ్రోర్వీస్థలిన్ ముంచి నే
టికి నిన్నేండ్లకుమార్పు తెచ్చినది గుండెల్ నిండ యీ తెల్గుజా
తికి హార్షోజ్జ్వలశాంతిచంద్రికలచే దీపించి సమ్యక్ సమై
క్యకథాగీతుల నాలపింపు రుధిరోద్గారీ ! యుగాదిప్రభూ !

దుర్వార ధూర్త ప్రోద్గర్వజృంభణ భీష
    ణోద్వేల వర్ణమహోగ్రభోగి
దౌష్ట్యసంక్లిష్టప్రోద్ధురతాకుతంత్రము
    ష్కరవాది నాయకజంబుకంబు
నక్షత్రనిలయఘంటామార్గమున దర్ప
    మున విజృంభించు ధారణిపిశాచి
దుర్దాంత దుస్సహ దుర్భరక్రూరహిం
    సాధ్వంసనైచ్య దౌర్జన్యకాండ

ఇవి యథేచ్ఛగా తిరుగుచున్నవి ప్రజాళి
జీవితాలతోనాడి కుస్తీలు పట్టు
చున్నయవి యివ్వి నశియింపకున్న లేదు
తెలుగులకు రుధిరోద్గారి యలతిదారి.

భ్రష్టుల్ కొందఱు తెల్గుసంస్కృతికి దౌర్భాగ్యమ్ము పట్టించి సం
తుష్టింజెందెడువేళ నొక్కని మహోద్ఘోషమ్ము పీయూషమై
పుష్టిన్ గూర్చునటంచు దుందుభితలంపుల్ మూర్ఛనందించె మా
కష్టాలన్నియు గట్టునెక్క రుధిరోద్గారీ! ప్రయత్నింపుమీ!

ఒకయేడాది గతించుచో మరలవేఱొక్కం డుగాధీశుడై
ప్రకృతిన్ పాలనచేయు నంతియె ప్రభుత్వాలెన్నియో మారినన్
సుకముల్ గూర్చినదింతలేదు ప్రజకున్ శోకమ్మనిల్చెన్ యుగా
ది కథానాయక! యేమిచేసెదవొ యీ తెల్గుల్ దయాభావుకుల్.

ఒక యుత్తుంగతరంగశృంగ మిటులేదో సేసె నిద్రాణ జా
తికి నైక్యమ్ము లవంతలేనిప్రజ కుత్తేజమ్ము గల్పింప నే
టికిరా! స్వార్థపిశాచముల్ మరుగుపట్టెన్ తెల్గుజాతీయతా
శకసూర్యోదయమిల్లె సాగవలె స్వేచ్ఛాదివ్యభావమ్ముతో.

క్షణికోద్రేకముకోసరమ్మిట తమాషాదర్పముంజూపి యే
లినవాడే ముడుపుల్ గ్రహించిన ప్రజల్ భీతిల్లరే యోయి నూ
తనవర్షాధిప సిగ్గుచేటగు మహాంధ్రత్వమ్ము క్షీణింపజే
సినవానిన్ గనిపెట్టి దుందుభివలెన్ శిక్షింపనర్థించెదన్.

తనతరువాత నీ తెలుగుధాత్రిని యెన్నోతరాలు హాయిగా
మనుగడ సేయగావలెసుమా! తన సంతతియుంచు దొడ్డిదా
రిని జమలేని విత్తమును రేలబళ్ళగడించు మూర్ఖ చి
త్తునకు యుగాది నీవుదయతో గుణపాఠము నేర్పగావలెన్.

తెలుగున్ దేశముపేరుతోనిలిచి దిగ్దేశాలు శ్లాఘింప ప్రో
జ్జ్వల జాగ్రన్మయదీక్షబూని నవమాసమ్ముల్ ప్రచండోద్ధతిన్
తెలుగుల్ మేల్కొన శంఖమూది సిడమెత్తెన్ నందమూర్యన్వయుం
డెలమిన్ కల్గెను తెల్గు సంస్కృతికి నే డీకీర్తి వర్షప్రభా !

ఇది బాపూజి పవిత్రహస్తములతో నేర్పడ్డపక్షమ్ము మా
కెదురేదిచ్చటనంచు నింతవఱకున్ జృంభించి యీదేశసం
పదకున్ గండినికొట్టి స్వార్థమునకై పంతాలతో మేటియ
భ్యుదయంబన్న ముసుంగుతో నడచువా రున్నారు వీక్షింపుమా.

నయమారన్ తెలుగుందనమ్ముగలదే? స్నానాలకుండీలలో
శయనాగారములందు నేమిటివిప్రశ్నల్ చచ్చుదద్దమ్మలి
ట్లు యుగాదీ ! తమజాతిసంస్కృతికి ముల్లున్ గ్రుచ్చుచో జాతి క
వ్యయసౌఖ్యావహ జాగృతుల్ నిజము శూన్యంబౌను నిర్జీవమా.

ఏరా ! మహాత్మజీ పేరుతో నేర్పడి
సలిపిన నీలోని సత్యమెంత
అవును లేరా ! హద్దుజవదాట స్వార్థమ్ము
వెన్నాడ నీవు కప్పితివి నిజము
ఈ ప్రజలెల్ల నీభృత్యు లటంచెద
తలచిన నీగొప్పదన మదెంత
ఎవని సొంతమ్మురా! యీదేశసంపద
మిడిసిపడుచు తెగ మ్రింగినావు

కళలపేరుసెప్పి కన్నుమూసుకపోయి
భజనపరుల స్తుతులబాట నడచి
విఱ్ఱవీగు నీకు విను రుధిరోద్గారి
తప్పకుండ బుద్ధిచెప్పగలదు.

ఖండింపుమో మహాకలుషితరాజకీ
యాల జీవుల దళారీలబెడద
పండింపుమో ధరాభాండమ్ముకొండాడ
తెలుగుసంస్కృతుల వెన్నెలలపంట
నిండింపుమో జాతినిర్ణిద్రవిఖ్యాత
పౌరుషధుర్యప్రాభాతచరిత
చెండింపుమో గుణశీల ధ్వంసోన్మాద
పథవర్తుని నయవంచనమ్ముల.

కరుణలేని చేతగాని దద్దమ్మల
బెట్టిదంపుగుట్టు కట్టుకథలు
మానిపించి తెలుగుమాగాణిభూముల
నేలుమో యుగాదిపాలకుండ !

1-4-1983

# రంగాజీ

రాజీలేని విధానవర్తనము నీలక్ష్యమ్మ గోసాయి బా
పూజీవాక్కులు నీకు ప్రాబలుకులెప్డున్ రైతుభాగ్యంపు టు
త్తేజమ్మూపిరి నీకు దేశజనయిత్రీస్వేచ్ఛ నీకాంక్ష రం
గాజీ ! నీమహితాశయమ్ములు నమస్కారార్హ సంభావ్యముల్.

భూమినిదున్ని ఘర్మజలముల్ స్రవియింపగ గష్టమోడ్చు నా
సామికి బక్కరైతునకు చాలనిజీవితముం బొనర్చి పెన్
బాములవడ్డ వారల శుభమ్ములకోసము గోగినేని రం
గా! మనుచున్ననీబ్రతుకు కాగడయా జగతీతలానకున్.

పుడమి కౌగిరమిడి ముప్ప్రొద్దు లరుసించు
కడుపునిండని రైతు కంటిధార
బ్రిటిషుపాలన మంతరింపగావలె నంచు
తనువున నడరు స్వాతంత్ర్యకాంక్ష
భారతీయత విశ్వవసుధాదిశాంచల
భాగాన నిలబెట్టు వజ్రదీక్ష
ప్రతిమానవుడు శాగరసరమ్యహృదయుడై
యలశారవలెనన్న యాత్మఘోష

నీ యెడదలోతుల నుబికి యీ యనంత
ధారుణీతలి నెల్లప్డు తడిపి యఖిల
మానవావళి సౌఖ్యసంపదలగోరు
సమసమత్వాంతరంగ ! ఆచార్యరంగ !

బావురమంచు నేడుచును బానిసపుందనమందు మ్రగ్గుచున్
చేవను గోలుపోయిన ఋషిస్థలి కూపిరివోయ బాపుజీ
రావమువించు చిత్తమదరన్ ప్రియపత్నియయైన భారతీ
దేవినిగూడ వెంటజనుదేరగజేసిన నీకు నంజలుల్.

ఆ హిమాలయ మివ్వల కన్యాకుమారి
నడుమ నివసించుచున్నట్టి బడుగురైతు
సుకముగా బ్రతుకుటె గొప్పశోభ యనెడి
ధర్మమూర్తివి ! భారతీధవుడ వీవు !

మానవకోటి కన్నమిడి మానవతన్ బ్రదికించు కర్షక
శ్రేణికి బాధకల్గిన భరింపని నీయెద వహ్నివార్ధి సం
తానములెన్నో ఘూర్ణిలెడి న్యాయము దప్పని యీకిసాన్ ప్రజా
వాణికి నీవు బ్రహ్మవు నివాళులు నీకగు రైతుబాంధవా !

గంగాచ్ఛాంబువుతో సమానము భవత్ క్రమైక్యవాక్యమ్ము లు
త్తుంగంబైన మహాహిమాలయపు టెత్తున్ మించు నీభావముల్
పొంగుల్వారెడు దివ్యమానవత నీలోకమ్ము యోజింపగన్
రంగా ! నీజననమ్ము దేశమునకున్ బ్రహ్మపదంచెంచెదన్.

ఈవు మహోన్నతాశయుడ వేబదియేడులు పార్లమెంటరీ
జీవితమున్ బొనర్చిన విశిష్టగుణాఢ్యుడ వల్ల గుర్జరీ
పావనమానిమార్గమున పాదము వెట్టి యఖండభారత
శ్వాసవిజయమ్ముగోరి చెఱసాలలకేగిన ధన్యమూర్తివో.

ఎచట నిడుద్రోలు సువిశాలపృథివియెచట ?
ఇచటనే కూరుచుండి యేవేవొ యూహా
లవనితలమున కందించునట్టివాడ!
ఈవు జన్మించుటే మా యదృష్టమయ్య !

బాధాతీక్ష్ణదవాగ్ని దగ్ధజనతాపక్షాన నిల్చుండి నీ
మేధాసంపద నంతవారికయి సంప్రీతిన్ సమర్పించి స్వే
చ్ఛాధాత్రీసతి కండగానిలిచి విశ్వఖ్యాతినార్జించు రం
గా ! ధీశాలివి నీవు నీచరితకయ్యా ! మా నమోవాకముల్.

చదువుముగియ నరసాన నధ్యాపక
వృత్తి బేర్మిని స్వీకరించునాడు
గతిలేని చేనేతకార్మికోద్యమముపై
దృష్టిని కేంద్రీకరించునాడు
పొగిలినయెద స్వయంపోషకవృత్తుల
రక్షణార్థమ్ము పోరాడునాడు
పూర్ణమానవుడు బాపూజి సత్యాగ్రహో
ద్యమయజ్ఞకుండాన దుముకునాడు

నీ గభీర ధీరతాగమ్య మేలాటి
దో తెలుంగు వెలుగుదురు నిజమ్ము
స్వార్థమింతలేనిజన్మ నీయది రంగ!
తెలుగుజాతి కది ప్రదీప్తచరిత.

అమృతమూర్తి ! రైతు వ్యవసాయకూలీలు
నిక్కవముగ రెండు నేత్రములట
నీకు నీయశస్సు లోకానపండువె
న్నెలల కుప్పవోసి వెలుగుసతము.

30-5-1984



# నర్ల

సంఘసంస్కార రథ్యామహాసవనకుం
డాన నాశయపు టింధనము వైచి
సకలసమానతాసౌజన్య కారుణ్య
స్రోతస్వినీధార లీలలాడి
ప్రాక్పశ్చిమప్రథా వైజ్ఞానిక గ్రంథ
సారసంగ్రహా విశేషములు సదివి
భావబంధురగాఢ ప్రచలిత చైతన్య
రచనాసుధల తెల్గుప్రజల కిచ్చి

డెబ్బదయిదేండ్లు కలిగిన లేవియింత
చెక్కుచెదరక నిలిచిన శేముషీధు
రంధరా ! తేనియలు నీదు రచనలందు
పొర్లిపారు యథార్థమ్ము నార్లధీర.

సురవరమ్ము చింతామణి సుబ్బరావు
రామరావు పున్నయ కృష్ణరావు చల్ల
సోదరులు దత్తు న్యాపతి సుజనవరుల
సారసంపాదకులకోవ జేరినావు.

కవివటన్న గాదు కాని నాటకకర్త
వన్న గాదు దొడ్డవ్యాసములకు
కర్తవన్న గాదుగాని మేల్ సంపాద
కుండ వీవు తెలుగుగుండె వీవు.

తరుగని వజ్రసాహితికి ధర్మముతప్పని మాటమంతికిన్
ఒరవడివెట్టిచన్న రచనోజ్జ్వల సుందరమార్గమందు నెం
దఱో పయనించి రిప్పటికితప్ప దిదెప్పటికిన్ ప్రజాహృదం
తరము లెఱింగి వ్రాయు రచనామతి' నార్ల! విశాలదృష్టిధీ !

సమతనేర్పని పురాణములను గర్హించి
హేతువాదమునకు చేతులెత్తి
ఛాందసంబైన భాషావైఖరిని నెట్టి
శిష్టజీవద్భాష కిష్టపడుచు
జనవాణికద్దమౌ సంపాదకీయాల
హుందాతనానకు విందుసేసి
ప్రగతినిరోధించు పనికిమాలినయట్టి
వ్యర్థఘుట్టాలను ప్రతిఘటించి

నీవు రచనలందు నీదైనశైలిని
నిలిపి తెలుగు మేలిపలుకుబడుల
గుస్తరించి వన్నెగూర్చితి సంపాద
కులకు గౌరవమ్ముగూర్చినావు.

జాగా చేసికొనెన్ సమర్థమగు నీసంపాదకీయాలు ది
వ్యాగారమ్ములుగా ననల్పరచనావ్యాసంగ పారంపరీ
భాగారమ్ములుగా సహేతుక లసద్వైశద్య విజ్ఞానభాం
డాగారమ్ములుగా తెలుంగుభువి నార్లా! నవ్యభావోదయా!

వితథపుచేష్ట లీజగతి వీరవిహారము సేయగాంచి నీ
మతి దురపిల్ల నీ నవసమాజపు స్థాపనగోరి వ్రాయు నీ
ప్రతిపదమందు నభ్యుదయభావపరంపర చూఱలాడు నీ
హితరచనోపదేశము లవెంతయు తెల్గుల కొజ్జబంతులౌ.

తెల్గుసాహిత్యములో నిలంబడగ వ్యాసప్రక్రియామార్గమం
దో సౌజన్యకళానిధీ ! తొలుత నూత్నోత్సాహసాహిత్యరే
ఖాసౌరభ్యము గ్రుమ్మరించితి వహో! సంపాదకీయాలకీ
వే సమ్రాట్టువు నీకల మ్మొలికెలే యీమాధురీబిందువుల్.

సమధర్మమ్ముగనెంచి విశ్వరచనాసామ్రాజ్య చారిత్రమం
దమరన్ వేమన ధర్మమార్గచరితం బందించి వీరేశలిం
గము సంస్కారచరిత్రసారమును లోకంబందు జాటింప నాం
గ్లములో నాంగ్లులు మెచ్చ వ్రాసితివి నార్లా! శేముషీవైభవా !

ఏది వ్రాసినసరె హేతువాదానకు
నిలిచిపోవు నీదు కలమునందు
నమృతరసతరంగ మానందనాట్యమ్ము
నీయెడందలోన జేయునేమొ?

పుట్టుచున్నయట్టి పుట్టెడు రచనల
మంచిచెడుల రెంటి నెంచగలుగు
తెలుగులోన నీకుగల దధికారమ్ము
ప్రజలెఱుంగుదు రిది నిజము నార్ల !

తెలియక నీదుపత్రికను దిబ్బయొనర్పగ ద్వేషమూని య
గ్గలికవుపట్టుతో నిను నగాధములోనికి దింపజూప నీ
కలము సహస్రదీధితులు వ్యోమగగనాన వెలింగి తీక్ష్ణతా
జ్వలనము సూప వైరి తెరచాటున దాగినగాధ చిత్రమౌ.

మెప్పుకొఱకు సేయు తప్పుతమాషాల
నొప్పుకొనవు వినవు గొప్పవాడు
గాని కొలదివాడుగాగాని సమదృష్టి
వాదభావనమ్ము నీది నార్ల !

19-9-1984



# రక్తాక్షి

మధురస్వప్నములెల్ల పండునని సంభావించి హర్షమ్ముతో
రుధిరోద్గారికి స్వాగతంబిడితి నారోజున్ నిరాశాధురా
రథమెక్కించి యనూహ్యకష్టములపాలన్ జేసె నేతద్వ్యథా
కథమాన్పించి సుఖైకశాంతినిడు రక్తాక్షీ ! మహాంధ్రాళికిన్.

స్తంభించునా సమాజధ్వస్తసూహాక
        కల్మషాత్మకుల దగాబెడంద
జృంభించునా జనహృదయాల మహితమా
        నవతాలతాంత గంధాలజల్లు
లంఘించునా జాతిప్రగతివైభవసిద్ధి
        కాదర్శపథక కార్యక్రమమ్ము
పొంగించునా దుఃఖమునమున్గు నిఱుపేద
        గుండెను సుకవివాగ్గుంభనంబు

ఏకలవ్యుని బాణవిద్యాకుశలత
ం నకర్ణుని ప్రతిభావిధానచరిత
వమ్ముచేసిన ధూర్తసంఘమ్ములోన
ఓయి రక్తాక్షి! చోటులేదోయి నిలువ.

విశ్వఖ్యాతినిగాంచినట్టి తెలుగుల్ విశ్వంభరాదేవి కీ
ఐశ్వర్యాలు జగాజగద్వలయ మాహారింప ద్వేషోగ్రదై
ర్ఘ్యశ్వాస మొమ్మనరించు దుర్మదులదౌర్జన్యమ్ము రక్తాక్షి! యే
విశ్వాసమ్మునస రూపుమాపి సహనప్రేమమ్ము స్థాపింతువో.

గంతల్ కండ్లకుగట్టుచున్ బ్రతుకు నీగాంధారిదేశాన నా
వంతున్ మ్రింగెడు దేబెగాండ్ర కుహనావ్యాపారలాభాలకై
వంతంబాడుచు సంచరింతు రిక నేపాఠమ్ము నేర్పించి యీ
తంతున్ అంతును రూపుమాపెదవా రక్తాక్షీ! యుగాదీశ్వరా.

సీదాగా నొకదొడ్డయాశయుని ప్రస్ఫీతోగ్రసంకల్పదీ
షాదకత్వము మార్పుతెచ్చునను కాంక్షల్ నేటికిన్ గుండెలం
దేదోరీతిగ నిల్చియున్నయవి నీవేలాటిచైతన్యరే
ఖాదార్ఢ్యంబు నొసంగి తెల్గులను రక్తాక్షీ! కటాక్షించెదో!

ప్రగతికి దూరులై తరతరాలు కరాళదరిద్రదేవతా
నిగళనిబద్ధజీవులకు నేటికిగూడ స్వతంత్రభూమియం
దగపడదింత సాంఘికమహాసమతాశయదీప్తి నిక్కనీ
లుగు కులమయ్యలున్నభువిలో జ్వలియించునె యైక్యదీపముల్

లోకువగా దలంపకుము లోహితనేత్రి! ప్రహర్షబుద్ధి నీ
రాకకు స్వాగతంబిడుట లాంఛనమేయగుగాని యెందుకీ
కోకిలకంఠనాదములు క్రొన్ననలెత్తెడు మావిచెట్లనూ
త్నాకృతు లీతెలుంగులకు నైక్యముగూర్చు ముగాదినాయకా.

ధ్వంసంబైనది దేశభాగ్యము జనాభాలో నహింసాభిసా
తాత్రింశశ్రీలు నశించిపోయినవి కర్తవ్యమ్ము బోధించి యీ
హింసాకాండకు తావునీయవలదోయీ ! నూత్న వర్ష ప్రభూ
త్తంసా ! సౌఖ్యమదేమిటో యెఱుగ రక్తాక్షీ ! యెఱింగింపుమీ.

దీక్షాభావము దివ్యదుజ్జ్వలసముత్తేజమ్ము రవ్వంతగా
సాక్షాత్కారము లేనిచోటను కులస్వామ్యంపు రాజ్యమ్ములో
నక్షీణైకసమైకతా మధుర సౌహార్దంపు సౌఖ్యాలు ర
క్తాక్షీ ! యెట్లు ఘటిల్లు భేదములు విధ్వస్తమ్ముగా కుండినన్.

ప్రవహింపవలె నూషరక్షేత్రముల మేను
పులకరింపగ తేటతెలుగుగంగ
సహరింపవలె సమాజస్పృహాలేని ఛాం
దస పురాశాస్త్రప్రస్తావనమ్ము
వివరింపవలె బీదబిక్కుజీవింపగా
నందింపగలుగు సహాయనిధులు
నినదింపవలె సమున్మేషసుస్నిగ్ధ మా
నవతాస్వభావఘంటారవమ్ము

తెలుగువానిమీద తెలుగువానికి ద్వేష
భావమోయి చరిత ప్రథమసాక్షి
వచ్చుచున్న క్రొత్త    మ్ము లవియేమి
సేసివెడలె నేమిసేసె దీ   ?

బీరము లావుసూపని వివేచనలేని విమర్శనాకుధ్రా
ధోరణు లెంతసేపు నిలద్రొక్కుకొనున్ ప్రతిపక్షగూడ నీ
తీరున వెల్లబెట్టెడి నదేపనిగాగ తెలుంగులందు లే
రార ! ద్వితీయనాయకమహాశయులోయి యుగాదినాయకా.

దండిగ్రామచరిత్రలో లవణసత్యాగ్రహి స్వాతంత్ర్యపున్
జెండాపట్టినవేళ నొక్కటిగనిల్చెన్ త్యాగభావాన బ్ర
హ్మాండమ్ముల్ గొనియాడ భారతము నేడాదేశమందెల్లెడన్
గూండాలే మసలన్ ప్రశాంతి యెటువాక్రువ్వన్ పిసాళించెడిన్.

చాడీకోరులు స్వార్థలోలురు దురాశావాదు లంధాత్మకుల్
తోడేళ్ళన్ మఱపించు ఘాతకులు గోతుల్ ద్రవ్వి సత్యానకున్
బేడీల్ వేసెదు నైచ్యదుస్థితిని ఖండింపించి భోగాల దో
గాడం జేయుము తెల్గుభూములను రక్తాత్రీ ! యుగాదిప్రభూ !

కూలినవానిజీవితపుగోడులు దొంగతనాలు మానభం
గాలు మఱిన్ని దోపిడులు కక్షలు హత్యలు బందుబస్తుగా
పాలనచేయుచున్నయవి ప్రాణముతో చెలగాటమాడుచున్
శీలములేనిజాతి వికసించునె ? కాంచునె ? గౌరవార్హతల్.

ఏనాడీజననీతలాన మతమత్తేభాల వర్ణాలహిం
సానృతోగ్రప్రచండతాండవము ధ్వంసంబై యహింసాసమా
ఘానస్నేహసుధాస్రవంతి మకరందశ్రీలు జాల్వాఱునో
ఆనాడే యదినా యుగాదియగునయ్యా ! వత్సరాగ్రేసరా !

25—3—1984

# ఆకాశవాణి

నీ, నా, హీనపథానబోవక సమున్నిద్రాత్మ నాకాశవా
ణీ నీధోరణిలో నపశ్రుతులు రానీకుండ చైతన్యసం
ధ్యానప్రోజ్జ్వల నైగనిగ్యకళలన్ పండించి వార్షాన దే
శానన్ జీకటిసంస్కృతిన్ తొలగ నాశాజ్యోతి వెల్గింపుమీ.

బాపూజీయను నొక్కబక్క ఋషి దివ్యస్థైర్యసంకల్పధీ
చాపమ్మెత్తి నిరంకుశప్రభువులన్ సత్యాగ్రహమ్మున్ దురా
శాపింజమ్మణచెన్ నవోదయ మహాశాంత్యుజ్జ్వలచ్ఛ్రీమరీ
చీపంథాన ప్రజావళుల్ నడువ వాచింపన్ ప్రయత్నింపుమీ.

త్రుప్పుంబట్టి తరాలుగా మునుల హిందూభూమి వేదాంతపున్
తిప్పల్పై వసియించి పుక్కిటికథానీకమ్ము నాలించి యా
గొప్పల్ చిప్పిలనెప్పుడున్ ప్రజలకున్ గొంతెత్తిఘోషించుటన్
తప్పాయం చనబోకు మభ్యుదయవేళాసుప్రభాతమ్ములో.

అభివృద్ధిపథకాల నాశించి యికపైన
చాలింపవే పురాణాలపఠన
సమతజూపని యసంస్కారవాదుల ప్రసం
గాలనన్నిటి నరికట్టగలవె

ప్రతిభావిహీను నాహ్వానించు దుష్టదు
స్థితికి ఫులుస్టాపు సేయగలవె
నవనవోజ్జ్వలభావనములేని రచనల
నిష్కర్షబుద్ధిమై నెట్టగలవె

ప్రాతచింతకాయపచ్చడి చందాన
నభ్యుదయము దూరమై జనాళి
దృష్టిలేనిరచన లింతకు దూరమ్ము
సేయఁగలవె మార్పు జెందగలవె ?

నీమార్గమ్ములు ధీవిశాలతకు సన్మార్గమ్ము లౌగాక నీ
లో మా, వీ, లకు తావులేనివిధముల్ లుప్తంబు లౌగాక నీ
ప్రామాణ్యమ్ములు దేశభాగ్యములకున్ బంగారురూపమ్ములై
స్వామిత్వమ్ము వహించుగావుత నభోవాణీ! విలోకింపుమీ.

ఒక లుచ్చాకుహనాబుధేంద్రు డిట నేదో మారువ్రాసెన్ పదా
నకు నర్థంబెఱుగున్ సుమీ! యదె ప్రమాణంబౌను నీలాటివా
నికి నీలో నొకయాశ్రయమ్ము కలిగెన్ నీవెట్లు కన్పట్టి వా
నికి బుద్ధింగఱపింతువో గగనవాణీ! నీదె భారంబగున్.

క్రొత్తదనమ్ము సూపి నవలోకము సృష్టినొనర్ప జాలు పెన్
గ్రొత్తదనాలభావములకున్ మెఱుగుల్ పచరింపజేసి మా
చిత్తములందు నిల్పుమిక చెప్పినదే మఱిచెప్పి నీవు మా
నెత్తిని సుత్తిగొట్టకుము నీకు నమస్కృతి రేడియోసతీ!

# దీపావళి

ధరణికి పీడగామసలు దైత్యశిరోమణి ప్రాణముల్ గొనన్
కరుణయొకింతసూపక రణంబొనరింప సవాలుసేసి యా
నరకచతుర్థినాడు తననందనుజంపిన సత్యభామ మ
మర్మయుతమంచు నెప్డు హృదయమ్మున వేడెద నీప్సితార్థమై.

ఈ దీపావళిసంబరాలు మఱియేవీ! నాటి యుత్సాహగా
థాదీప్తోరుచిరోజ్జ్వలన్మధుర బంధాలేవి? సారూప్యమే
భేదంబయ్యెను మింటిపై నెగయు దీప్తిజ్వాల లీవేళ నే
దోదైన్యమ్ము వెలార్చుచుండుట నదేదో దుఃఖముప్పొంగెడిన్.

నా డొకడే నరాధముడు నాకము లోకములోనివారిపై
దాడినొనర్చె నా డతనిధాటికి సత్యయొకర్తె నిల్చి చెం
డాడెను నేడు నీజగతియంతయు మ్రింగెడువారినెల్ల చెం
డాడెడు నెవ్వరో తెలియదంతయు సృష్టిమహారహస్యముల్.

పరమఘాతకుండు నరకాసురుడు చావ
వెలిగె నింటదీపములవ్రజమ్ము
నాటి దీపరాశి నగవులచిందించి
తెనుగుపుడమి నేలుకొనునుగాక!

ఈ దీపాలవెలుంగులో మురిసిపోయె న్నాడు లోకమ్ము నే
డీదీపాలవెలుంగులో సహితమల్లే కొట్టుమిట్టాడ నా
హ్లాదంబందినచో జగమ్మునకు నేలా ? రాకమానున్ సుఖ
శ్రీలాభమ్ములు తెల్గుజాతికెపుడున్ శ్రేయోనిధానమ్ములా.

10—10—1984



# జయంతి

మేనుల శీతలానిలము మేకొనుచున్నను గాంచినట్టి యా
హ్వానముమీద మీదగు మనోజ్ఞములెల్లను పల్లవింపగా
మానితశారదాచరణమంటపభూమి నలంకరింపగా
పూనికతోడవచ్చిన మిమున్ నుతియింతు రసజ్ఞలోకమా !

రసికోత్తంసులు సాహితీప్రియులు పూర్ణప్రజ్ఞులౌదార్యపున్
పసరాణించెడు దాతృతామణులు విద్వద్వంద్యు లీనాడు సాం
పెసలారన్ జనునట్టి యీసభకు సాహిత్యప్రభాపుష్పగం
ధసమారాధకులై రహించుట రసానందమ్ము సిద్ధించెడిన్.

సమ్ముదాన "నాంధ్రసాహిత్యఅకడమీ"
శ్రీజయంతివారి యీజయంతి
వేడుకలర కాకినాడలో సేయుట
తృప్తి తెలుగులకు సదృష్టదీప్తి.

నిలుచునా యీనాడు నిండుప్రోత్సాహమ్ము
నందని పద్యవిద్యాలతాంగి
పిలుచునా యీనాడు బీదబిక్కతనాన
తిరుగాడు వ్యాకృతిసరసిజాక్షి

కొలుచునా యీనాడు గుప్పిళ్ళతో సిరుల్
సుకవీంద్రునకు రసజ్ఞుడు ముదాన
పొలుచునా యీనాడు కలగుండుపడుచున్న
గ్రాంధికభాషావికాసలక్ష్మి

బుధవిధేయులందు పొరపొచ్చములులేని
బ్రతుకు సాగునా ? ధరాతలాన
సమతనెఱపువాడు జన్మించుచో నాడు
లలితకళలు వెన్నెలల చరించు.



# పున్నయ్య

కడుపుల్ మాడుచు నంటరానితనమున్ కారాగృహానన్ శ్రమల్
పడి దైన్యమ్మున మ్రగ్గు పంచములకున్ ప్రాణమ్మవై దీక్షమై
నడుమున్ గట్టిన నీచరిత్రను మహాంధ్రక్షోణి కొండాడగా
నడరెన్ నీ మహనీయతాగుణము పున్నయ్యా! దయాభావుకా!

బుసలన్ గొట్టెడు వర్ణసర్పములు నిప్పుల్ వోలె నాశీవిష
ప్రసృతింగుప్పిన హైందవమ్మున వసింపన్ స్వేచ్ఛ లేనట్టి జా
తిసమగ్రస్ఫురణైకసచ్చరిత మందింపించి మేల్కొల్పి ని
యసమానోజ్జ్వల యూహ లెన్నదగునయ్యా! న్యాయమూర్తీశ్వరా!

పుట్టినతోనె పుట్టినదిపూర్తిగ నీయెదలోన జెప్పనె
ప్పట్టుననైన నేను భగవంతునిపేరట సేవజేసి యీ
యట్టడుగున్ వసించెడు జనాళికి తోడుగనుందునన్న యా
గట్టిప్రతిజ్ఞకున్ దెసలు కంపమునొందవె? ధార్మికోత్తమా!

వన్నె కెక్కెను బారువాగ్రామరాజమ్ము
నీవదచ్చోట జన్మించుకతన
ఘనకీర్తిగాంచె మంగమ్మసాధ్వీమణి
తనయునిగ నినుగన్నందుకతన

ఆనందపడెను పాపయ్య సద్గుణమూర్తి
నాన్నగా నీకయినందుకతన
చిరునవ్వు చిందించె నరసయ్యఘనుడు నీ
వనుజునిగా బుట్టినందుకతన

అటులె యోగేశ్వరస్వామి యన్నయగుట
ఆదినారాయణాభిధుం డనుజుడౌట
నీపురాకృతపుణ్యమ్ము నిండెననుట
కనలివె నిదర్శనమ్ములు న్యాయమూర్తి!

సవజాతీయత పాదుకొల్పగను కంఠంబెత్తి చిన్నప్పుడే
మిత్రులన్ దేశము పొంగిపోయెను సమున్మేషంపుగీతమ్ములన్
దివి బెంబేలుపడంగ పాడితివి నీ నిష్కల్మషంబైన మా
నవతావాదము కొత్తపల్లి కులమాన్యా! శ్లాఘనీయంబగున్.

నిజమున్ దాచి యసత్యమున్ శిరసుపై నెక్కించుకొన్నట్టి యీ
బిజగున్ హైందవమందు వర్ణ మతవిద్వేషాగ్నిలో ద్రుగ్గు నీ
ప్రజకున్ పంచమజాతికిన్ వలయు కర్తవ్యమ్ము బోధించు నీ
ఋజుమార్గమ్ము జగమ్మెఱింగినదిసుమ్మీ! మంగమాంబాసుతా!

దండిసత్యాగ్రహోద్దండుండు బాపూజీ
శాంతినిర్ఝరిని మజ్జనము సలిపి
చండశాసకుడు ధీశాలి యంబేద్కరు
భావాలపదములో పదము వైచి

అందాల సాహితీనందనోద్యానాన
తనువుపొంగగ విహరణము సేసి
నవసమాజస్థాపనము మానిఖండాన
స్థాపింపవలెనన్న తపన గలిగి

చిన్ననాటినుండి మిన్నైన యాలోచ
నమ్ము కలిగి జీవితమ్ము సేయు
కొత్తపల్లి వంశకోవిదమణియైన
న్యాయమూర్తి పున్నయా! నమస్సు.

ఈ నాభూమిని నాప్రజావళికి మీరే మేటిచైతన్యవి
జ్ఞానజ్యోతిని వెల్గజేసితిరి హింసాదూరులై శాంతిమా
ర్గానన్ బోయెడుజాతి కభ్యుదయమున్ గ్రంథాలసారస్వత
శ్రీనిండార పఠించుభాగ్యమును మీరే చేయభాగ్యంబగున్.

ఎడదలో కారుణ్యమే పార కోర్టులో
దీనులపట్ల వాదించునాడు
స్వంతజిల్లాపరిషత్తులో నిఱుపేద
ప్రజల కుద్యోగాలు పంచునాడు
ఇంటికేతెంచెడు భృతిజనావళికెల్ల
నిండార నాతిథ్య మిచ్చునాడు
రాజకీయమునందు ప్రగతినార్జింపని
జనుల కుద్బోధన సలుపునాడు

న్యాయవాదిగా జీవించునాడె నుడువ
నీ యశోడిండిమము మ్రోగె నీయనంత
మహితమానవత్వము తెల్గుమహిని వెలసె
అమృతహృదయ ! దయాబ్ధి ! పున్నయ్య ! సదయ !

రాజకీయమా ! సాహిత్యరంగమా ! మ
రిందునిన్నది తొల్లి వరించెనందు
మా ! వచించుట సులభసాధ్యంబుగాదు
రెండు నొకసారె నిన్నువరించె నిజము.

దయివార మధురశబ్దప్రయోగములతో
గంభీరమగు ప్రసంగమ్ము సేసి
హృదయాన తలచుచో నెట్టికార్యంబైన
వాసికెక్కగ దానిచేసిచూపి
నిజజీవితమునందు నీతివిస్తరహింప
నానందమున ధర్మమాచరించి
జాతీయజీవన జాగ్రన్మహాయజ్ఞ
సంకల్పసిద్ధికి సమ్మతించి

దినదినమ్ము ధర్మదేవత మిపులసం
ప్రీతినొంద న్యాయపీఠమెక్కి
న్యాయమునకు వెలుగునందించు నీకీర్తి
నాల్గుదెసల నిండె న్యాయమూర్తి !

ఉల్లములో న్యాయము వ
ర్ధిల్లుటయే గొప్పదనుచు తెలిపిన నీదా
చల్లనితీర్పులు చెప్పను
జిల్లాన్యాయాధిపతిగ చేసినవేళన్.

తలవిజ్ఞానముగల్గు మంత్రిణి! యథార్థంబన్న హర్షించు నా
ప్రతిభాభారతిగన్న తండ్రివి దయార్ద్రస్వాంత లీలావతీ
సతికిన్ భర్తవు సద్గుణాలకు నివాసస్థానమైనట్టి నీ
యతినైర్మల్య ఋజుప్రవర్తనకు పున్నయ్యా! ప్రశంసాప్లుతుల్.

అవమానంబగు నంటరానితనమం దత్యంతహైన్యమ్ములో
చివికెన్ పంచసహస్రవర్షములు వాసింగన్న నాజాతి యం
చు విషాదాబ్ధినిమున్గి జాతికి యశస్సుంగూర్పయత్నించు రెం
డవ యంబేద్కరుడీవు తథ్యమిది పున్నయ్యా! ప్రభావోదయా!

అమృతమ్ము నీవ్రాఁతంతర
మమృతము నీనడలు బెడగుటాలాపమ్ముల్
అమృతమ్మగు నీన్యాయ
మ్మమృతము నిజమిదియ జాతికాభరణమ్ముల్.

13—9—1983



# అంకితము

అంకితశబ్దమందు గలయర్థము నందలిగౌరవమ్ము నే
వంకనుజూచినన్ పరమపావన భావము గోచరించు నీ
యంకితమే యశోగృహమ్మునై రవిచందిరు లుండుదాక యా
య్యంకితభర్త పేర్నిలుపు నాతడు శాశ్వతు డీవసుంధరన్

కాలశతాంగచక్రగభీరగమనాన
    కూలిపోవును గుడిగోపురమ్ము
ప్రళయప్రభంజనస్వామి సంరంభాన
    విఱిగిపోవును కాంస్యవిగ్రహమ్ము
ప్రకృతిక్రుధాతీక్ష్ణజ్వలిత భూకంపాన
    మాసిపోవును దివ్యమందిరమ్ము
జమలేని శాత్రవసైన్యసంఘర్షాన
    ప్రధ్వంసమౌ రాజ్యవైభవమ్ము

జగతిలోని సర్వసౌఖ్యసౌభాగ్యాలు
శాశ్వతములుం గావు శాశ్వతముగ
నిలిచినిలువబెట్టు కళ కవిత్వముగాన
నందె కృతిని యొఱిగినట్టివాడు.

ఈ వసుధాస్థలిన్ గలుగు నిద్ధమహాసుఖభోగరాశులం
దేవియు నిల్వజాలవు మఱేమియు కట్టుకపోడు మానవుం
డేవిధి జన్మమెత్తెనా యదేవిధి పోవును నిల్చునట్టి దీ
భూవలయాన సత్కృతి ప్రభూతయశమ్ము కృతీశుడందుపో.

నన్నయ్యగారి గ్రంథమును గైకొనుటచే
తేజరిల్లెను రాజరాజ యశము
కవిసార్వభౌముని కావ్యమందుటచేత
చెన్నుసలారె సింగన్న చరిత
పెద్దన్న వ్రాసిన పెనుకృతివలననే
క్షితినిల్చె రాయల కీర్తిలక్ష్మి
రుద్రయ్యకవితలో భద్రమైనందున
గడిదాటె కుతుబుషాగౌరవమ్ము

జరయు మృతియులేని చరితకల్గిన కృతి
గొన్నవానియశము కువలయమున
నిలుచునట్టికృతిని నిర్మించువానిని
యాదరించుచో మహాద్భుతమ్ము.

కృతినాథుండు విశుద్ధచిత్తమున పేర్మిన్ స్వీకరించున్ సమ
ర్పితకావ్యమ్మును కావ్యకర్త కవితాపీయూషముంజిల్కి శా
శ్వతమాస్థానముతోడ కీరితిని నాపాదించు గైకొన్న యా
కృతినాథాగ్రణికిన్ రసగ్రహణపారీణత్వ మేలాటిదో ?

ముత్యాలశాలలో ముదమార కవిరాజు
కనకాభిషేకమ్ము గొనినవేళ
ప్రమదాన పేరోలగమున లోకజ్ఞుండు
హైమసత్కారమ్ము లందువేళ
దారివోయెడు కవితాపితామహుడు భూ
భుక్కు నేనుంగుపై నెక్కువేళ
ప్రకటితమ్ముగ శ్లేషసుకవీంద్రు నింటిలో
కలుములజవరాలు నిలుచువేళ

ఆమహాకవీంద్రు లిడిన యంకితాల
భాగ్యమది యూ రసజ్ఞుల భావమద్ది
కృతులపాలిట కృతిభర్త లిటులెయున్న
శారదాదేవి కదియ వసంతవేళ.

నాడు కులాలగోల కృతినాథుల కున్నదో లేదోగాని యా
నాడు కవుల్ సుఖించిరను నానుడి సత్యమటంచు నంకితా
లాడెను కావ్యరాజముల నంకితమందు కృతీశ్వరుల్ కళా
నాడికి పట్టుగొమ్మ లయినారను వాక్కులు తేటతెల్లముల్.

కానుకగా కవీంద్రు లిల కమ్మనిజీవితముం బొనర్ప జాం
బూనదమగ్రహారములు పొంపిరివోవగ భోగభాగ్యముల్
మానితభావమొప్ప కృతులంగొని కూర్చిరి యందుకే కవీ
శానులు సాహితీతపసుసల్పి సృజించిరి మేలికావ్యముల్.

అడిగె కవిని తేని యందఱముందఱ
నెయ్యమడర గృతిని నియ్యుమనుచు
నంత కవియుకోరినట్టివి యారాజు
కూర్చె నిది రసికతకు గుఱుతింపు.

మునుపెవండొ వ్రాయుమని కృతి కవిచే ర
చింపజేసికొనుచు చిట్టచివర
కవిని మోసగించు కథ లచ్చటచ్చట
గలవు నూటికెన్నొ తలచుకొనగ.

తమ యనంతరమ్ము తమకీర్తి ధాత్రిలో
నిలువవలయు కృతిపతుల మనస్సు
కృతిరచించు సుకవి బ్రతుకుకూడ నిలువ
వలయు నిడుములున్న తొలగవలయు.

తన యశస్సు శాశ్వతముగ నిల్పినకవి
చీకు చింత లేని జీవితమ్ము
క్షితిని జేయునట్లు కృతిభర్త చూచుకో
వలయు నంకితాల బాంధవమ్ము.

అంకితమ్ము గొనుట నది తమాషాకాదు
మట్టిపాలుగాని చుట్టఱికము
కృతిపతీశు డిది గ్రహించినచో నెద
కవులజీవితాలు చివురుతొడుగు.

తన కవితాసుధామధురధారలతో తనియించి శాశ్వతం
బునయిన కీర్తిగేహమును పొల్పెసలార సృజించు సత్కవీ
శుని రసమూర్తిచూడవలె చూచినవేళ కళామతల్లి పొం
దును మహదైకహర్షము వినూతనతేజ మికేమికావలెన్.

10-6-1983



క్రీ

నీకున్ కాలముసెల్లె నీనడలు కన్పింపరాదింక సం
చాకూతమ్మునరించు నవ్యరచనావ్యాపారులన్ నేడుగా
డీకొంచున్ నిను నుద్ధరించుటలుగంటే! నా యథాశక్తిమై
బాకీపడ్డ సరస్వతీ! తెలియ దీబాంధవ్య మేనాటిదో ?

దొరకని యర్థశబ్దములతో గరువించి నిఘంటురాశిలో
దొరలని మారుమూలపదధోరణిలో పయనించు నీకథా
సరణికి కొంతమార్పు కొనసాగుట లెస్సగు జాను తెల్గులో
తరలుట నీప్రజావళికి దర్పణమై రహియించు నెన్నడున్.

చిందుల్ ద్రొక్కి ధరాధినాథుల కళాశ్రీస్థానపీఠాలపై
విందుల్ సేసి నటించు నీనడక లీవేళన్ ప్రజారాజ్యమం
దెందున్ వన్నె కెనెక్క వీయుగపుసాహిత్యమ్ము సుమ్మిద్ది! యో
ఛందస్సుందరి! దిద్దుకోవలయు భాషాప్రౌఢమార్గమ్ములన్.

ఏదో కొండికవర్గమే బ్రతికిపోయెన్ నిన్నుభూషించి తా
నేదారిన్ నడిపించెనో యటులనే యీవేగి యిన్నాళ్ళుగా
సాదామర్త్యులకందకుండగ తమాషా చేసి నర్తింప భా
షాదేవీ! యికనాటచెల్లదు ప్రజాస్వామ్యస్వరాజ్యమ్ములో.

ఈపడికట్టుమాటలు సహింపని క్రొత్తతరమ్ము లేచి భా
షాపరమైన భేదములచాటున నిన్ను తిరస్కరించి యే
దో పరినూత్న పద్ధతులతో కవితల్ పచరించువార లా
దాపున కేగి వారలవిధానములన్ పరికించి తేల్చుమీ.

శబ్దశాసనుని భాషాస్యందనంబెక్కి-
తత్సమాల పదాల కుత్సహించి
కృతిని నుయ్యాతలూగించు కవిబ్రహ్మ
తెలుగుపలుకుబళ్ళ తేనెజుర్రి
తెనుగు సంస్కృతికి వంతెన శంభుదాసుని
హరికథాగానమ్ము నాలకించి
కవిలోకవంద్యుండు కవిసార్వభౌముని
రచనాపథాన చరణమువైచి

బిఱ్ఱబిగిసి వేదవిద్యయా ఛందస్సు
వీడసట్టి నీకు విశదమయ్యె
నేటి క్రొత్తతీరు నీమార్గమునగూడ
జగతి ప్రగతికొఱకు సాగనిమ్ము.

9-10-1983.

* *

# నట సమ్రాట్

ఘనగర్జాసదృశప్రభూతమగు నీగంభీరకంఠాన విం
డిన దేలాటిమహత్వమో తెలియలేనేలేము చిత్రాలలో
గొనబున్ జూపిన నీ నిసర్గనటనాకూలంకషప్రజ్ఞకున్
తనివిం జెందనివా డెవండరయ రంగారాయ ! విద్యోదయా !

సహజముగా నటింతువు పసందగు విందులు చిత్రసీమ మే
మహరహమున్ భజింపగను హాయిగసల్పెదు పాత్రలెట్టివై
న హరువుసూపు నీదు నటనాప్రతిభావిభవైకసంపదల్
రహి మహిరంగరాయ ! యతిరమ్యములై వెలుగొందుగావుతన్.

నటసమ్రాట్ బిరుదమ్ముతో తెలుగు లానందింప క్రొంగ్రొత్తవౌ
నటనమ్ముల్ పొనరించి మెప్పులనుగొన్నావయ్య వాక్రువ్వ నేం
తటిశక్తిం గడియించుకొంటివో ? మహాంధ్రక్షోణి కీనాడు ద
క్కుట నీవంటి కళాతపస్వులప్రశస్తుల్ సార్థకంబౌటకున్.

ప్రతివాడొక్క మహానుభావుడగు నీపాపిష్ఠికాలాన న
ప్రతిభల్ పూజ్యతగాంత్రు ధర్మమును సంరక్షించువా డెవ్వడీ
క్షితిలో నీనటనామహాత్మునకు నుజ్జీలేదు నేర్పింతజూ
పితి వీ తెల్గులుమెచ్చుకోగ ఘనయస్వీరంగరాయాభిధా !

జంకింత లేక దర్జాసూపునట్టి గం
భీరమా నీనిండువిగ్రహమ్మ
క్రొంగ్రొత్త పోకడల్ గుబాళించి పయనింప
నలరారు నీవాచకాభినయము
చలనచిత్రప్రదర్శన ప్రయోగము లందు
గడిదేఱు నీదర్శకత్వసిద్ధి
ప్రతిభాప్రశస్తసంబద్ధమై యొసలారు
నీపాత్రపోషణనిర్వహణము

దీటులేని నీదు దేశభక్తికి యింత
కారణమ్ము త్యాగకార్యవితతి
చలనచిత్రధరణి జైత్రయాత్రల సల్పి
రాణకెక్కవయ్య! రంగరాయ!

తమితో నీవఖిలాసియా చలనచిత్రమ్ముల్ ప్రదర్శించుప
ర్వములో పాల్గొని యంతులేనిదగు విశ్వఖ్యాతినార్జించి యు
త్తమసన్మానము లందుకొంటివి జకర్తాపత్తనంబందు దే
శముగర్వింపగ నీవు ధన్యుడవు శ్రీసామర్లవంశోత్తమా!

17-9-1969.



# షష్టిపూర్తి

ఈభాషాలలితాంగి యీభువనమందెన్నాళ్ళు చైతన్యరే
ఖాభాస్వన్మధురైకరూపమున సాక్షాత్కారముం జెందునో
సాభోగమ్ముగనల్లె కొత్తపలి వంశశ్రేష్ఠ ! శ్రీవీరభ
ద్రాభిఖ్యా ! నిలుచున్ భవచ్చరిత సీకౌగాక బ్రహ్మాయువుల్ .

సతతాభ్యాసముచే ప్రశస్తమగు భాషానిర్ఝరీత్రోయసం
తతిలో గాహనముం బొనర్చితివి విద్వాంసుల్ ప్రశంసింప నీ
ప్రతిభాపాండితిగాంచినా రమెరికా రష్యామహాదేశ పం
డితు లీ తెల్గుల కేమి ? నీకగు సమున్మేషప్రధాసౌఖ్యముల్ .

మహనీయంబగు మానవత్వమునకున్ మర్యాదగల్పించు నీ
స్పృహకున్ నీతికి నంకితంబయిన నీవిశ్వైకభావానకున్
సహనశ్రీలకు నేడు కొత్తపలివంశశ్రేష్ఠ ! షష్ట్యబ్దపున్
మహమిప్పించు సమగ్రసుందరమహానందైక సౌభాగ్యముల్ .

అగుపించు ప్రతివిగ్రహమునకు భక్తిమై
చెంగనా లిడుచు సాష్టాంగపడుట
వినిపించు సాహితీధ్వని పూర్ణశబ్దసం
పచ్ఛయాన కెడంద మెచ్చుకొనుట

సొగయించు నుజ్జ్వలసుఖశాంతి జనులకం
ఉనచిత్తమందున తనివిగొనుట
నిగడించు సత్కళాప్రగతి కెవ్వేళల
రుసివోలె మివ్వుల సంతసముపడుట

నీకుదక్కెను మఱి నిజమే యిదేతెల్గు
జాతిభాగ్యమనుట స్పష్టమగును
కొత్తపల్లి వంశ్య ! కువలయాన సుఖాలు
వీరభద్రు డొసగు వీరభద్ర !

సర్వగ్రంథములందు గల్గిన సుధాసారాంశమున్ జిహ్వపై
పర్వంజేసిన నీమహాప్రతిభకున్ పాండిత్యవైదగ్ధికిన్
గర్వంబించుక లేని నీనడతకున్ గల్గున్ సుఖౌజ్జ్వల్యపున్
పర్వంబుల్ భువి కొత్తపల్లికులదీపా ! వీరభద్రాభిధా !

ఘనతగాంచిన యధికారభాషాసంఘ
సభ్యుడవు మహాంధ్రశాబ్దికుడవు
తెలివి గంపెడున్న వెల కమ్ముకోలేని
ధీరుడవు నిజాయితీపరుడవు.

ఋషిచంద్రుండు వశిష్ఠుగోత్రమున నీవీనేలలోపుట్టి స
త్కృషికిన్ పట్టముగట్టి మానవతకున్ దీప్తిన్ ప్రసాదించు నీ
ధిషణాతత్త్వము దిగ్దిగంతములలో దీపించు నీకెప్పుడున్
సుషమాభాగ్యములున్ జిరాయువుల నిచ్చుంగాక యీశుం డొగిన్.

అఱువదివత్సరాలు వయస్సైననినున్ మఱినాశ్రయించు నిం
కఱువదివత్సరాలు మనస్సై కడుదీవనలిత్తు తెల్గులం
దఱ కిటులౌత ! వార్ధకమునన్ జిఱుప్రాయముగల్గు నీకు చే
కుఱుత మనామయ ప్రశుభగుంభనమైన చిరాయురున్నతుల్.

అఱువదేడులు దాటినట్టి నీవయసుకు
　　వలపుదీవనల సంపదలమూట
మేదురంబైనట్టి నీదైవభక్తికి
　　నుజ్జ్వలంబైన యాయుర్విభూతి
ఉన్నదున్నట్లుగా నన్ననీపల్కుకు
　　వెలలేని మురిపాల చిలుకరింపు
మహితమైనట్టి నీ మహాశయమునకు
　　గొనబారు ముత్యాలగుబ్బగొడుగు

పుడమి నిండుబ్రతుకు నెడదలో వాంఛించు
నీ స్వభావమునకు నిండుశుభము
కొత్తపల్లి వంశకోవిద ! నీకౌత
షష్టిపూర్తి విజయసంభ్రమమ్ము.

**12-5-1983**



# అ భి నం ద న ము

సనదుల్ గైకొనునట్టి శ్రీబలుసువంశశ్రేష్ఠు లవ్వారియం
దున విఖ్యాతిగడించు బుద్ధిఖనికిన్ తోరంపుస్వాంతమ్ముగ
ల్గిన యౌన్నత్యగుణైకభాసురునకున్ గీర్వాణవిద్యాకళా
ధనులన్ పోషణచేయు చంటి దొరకున్ ధాత్రిన్ సుఖాలయ్యెడిన్.

ప్రాపకమింతలేని పనివాడగువిజ్ఞుని గాంచి యింటిలో
దీపమువెట్టి ధార్మికహృదిన్ పరమార్థమునెంచి డంబముల్
చూపక స్నేహభావమునజూచు రసజ్ఞున కీజగత్తులో
కాపురముండు చంటిదొరగారికి సౌఖ్యయశఃకళాంగనల్.

నిచ్చెనమెట్లవోలె నిట నేటికి నేబదినాల్గువర్షముల్
వచ్చిన డాబులేని గుణభాస్వదఖండ రసైకమూర్తికిన్
పొచ్చెములేని వంశమునబుట్టిన యచ్చపుదేశభక్తికిన్
మెచ్చిన బుచ్చికృష్ణునకు మేలిమిబంగరుకీర్తి కల్గెడిన్.

తలచునా మేధలోపల నిమేషములోన
సక్రమమ్ముగ పనిసాగజేయు
పిలుచునా సత్కళాపీఠుని బ్రతుకులో
చిఱునవ్వు వెన్నెలల్ కురియజేయు

కొలుచునా జగతికి నిలయమౌ విశ్వేశు
పాదపంకజముల భక్తి మెఱయు
మలచునా యెంతటి మహితకార్యమునైన
చిటికెలో సంపూర్తి జేయజాలు

తనకు మనసుకలిగి తనియజాలినచో న
దెట్టిదైన నాత డెట్టివాడు
నయిన గౌరవించి యాతని దీవించు
నట్టి చంటిదొరకు నగుత యశము.

22-9-1974.



# రా జ ధా ని

వెలిగెన్ స్నిగ్ధసమైక్యసంపదలదివ్వెల్ నాడు గోల్కొండభూ
స్థలిలో రెండు విభిన్నసంస్కృతులమధ్యన్ ప్రేమపీయూషధా
రలలో నందటిగుండియల్ తడిసె తొల్తన్ రాజధానీ! నమ
స్సులు నీకర్పిము నేడు కాలినది విచ్చుంగత్తు లూరేగగన్.

పటువజ్రదీక్షతో నిట కులీకుతుబుషా
గోలకొండను పట్టుకొన్ననాడు
భాగ్యమ్మ నిట కుతుబ్షా వివాహంబాడి
తెలుంగుజీవనములో గలియునాడు
మధురాత్మ నిచ్చోట మల్కిభరాముండు
లలితకళాసేవ సలుపునాడు
హిందు ముస్లిమల సంబంధసౌగంధ్యమ్ము
లెసలార తానీష యేలునాడు

సొబగుమీఱు చెలిమిజ్యోత్స్నమరీచులు
వెలిగె ప్రజల హృదయవీథులందు
తెలుగుభువనమందు వెలయుత మానాటి
కలుషరహితమైన చెలిమివెలుగు.

అల్లాయున్ రఘురామచంద్రులును నాప్యాయమ్ముతో స్నేహమున్
జల్లుల్ చల్లిననేలలో నిరుపమానంబైన యైక్యమ్ము రం
జిల్లన్ నిల్పుము వారసత్వమును నక్లేరాజధానీ! క్రుధా
కల్లోలమ్ముల మాన్పి సర్వసమతాకల్యాణసంధాయినీ!

అదుగో! ధర్మనిబద్ధదీక్షితులు మా యక్కన్న మాదన్న లి
ర్ద్వరు నీయున్నతికై నిరంతరము పాటుంబడ్డ మేధానిధుల్
పరిరక్షించిరి సర్వవర్గములు వివాదమ్ములేనట్టి శాం
తిరమన్ నేడును నావిశేషములు రానీ! రాజధాన్యగ్రణీ!

ఈనేలన్ మెయిపుల్కరించెడిని భాయీ! భాయి! స్నేహాలు గా
నానందామృతనాదముల్ శ్రవణముల్ దాకన్ ముసల్మాను హిం
దూనేస్తాలు రహించి పూచినవి యందుంగల్గు సౌరభ్యముల్
ఈనాడున్ సకలాంధ్రభూతలమునం దేపారగా జేయుమా!

సాలారుజంగ్ ప్రపంచప్రసిద్ధినిగన్న
శిల్పాల నొకచోట చేర్చినాడు
మూసీనదీవేగమున కడ్డునిర్మించి
విశ్వేశ్వరయ భిక్ష పెట్టినాడు
ధ్యేయమ్ముకోసమ్ము షోయిబుల్లాఖాను
తృణముగానుసురు లర్పించినాడు
జనసమూహమునకు హనుమంతుపంతులు
విజ్ఞానతృష్ణ గల్పించి-ాడు

గమ్యమొకటై తారతమ్యమ్ము లేనట్టి
సహనజీవనాలు సలిపినారు
రాజసమ్ము నెఱపు రాజధానీ! నాటి
భ్రాతృభావ మలరవలయు నేడు.

అమితోత్సాహముతో చరించిరెదలం దావేళ రాగాలభే
దము రవ్వంతయు లేక భావములసూత్రానన్ శతాబ్దాల స
ఖ్యముసౌఖ్యమ్మును ముఖ్యమై వెలయ నాహ్లాదమ్ము నర్తింపగా
నమరన్ శాంతిసుధాస్రవంతు లిపుడల్లాగాత మాంధ్రావనిన్.

అందమ్ముల్ గుఱిపించు నాగరకతా వ్యామోహలావణ్యపున్
బంధమ్ముల్ గలదాన! వర్గముల సంబంధమ్ము విద్వేషపున్
హిందూముస్లిములన్న యంతరము లేనేలేక సోదర్యపున్
గంధమ్మంటిన నీసుతావళికి నైక్యమ్మున్ ప్రసాదింపుమీ!

వెదజల్లెన్ తనువుండునంతవఱకున్ విజ్ఞానబీజాలు శా
రదకున్ రూపముగాగ శ్రీసురవరం రడ్డీంద్రు డుత్తేజపున్
హృదయుండై సమతానురాగములు నిల్పెన్ హిందుముస్లిమ్ జనా
భ్యుదయంబై నిలువన్ వలెన్ మఱల నేడో రాజధాన్యగ్రణీ!

సహనస్వాంతులు బాపుజీహితులు నిస్స్వార్థుల్ మఱింకెందఱో
మహనీయుల్ మతసామరస్యము రహింపన్ సర్వమున్వీడి యీ
మహదాంధ్రమ్మును నిల్వబెట్టుట తలంపన్ రాజధానీ! శుభా
వహమై పొల్చెడి వారికయ్యెడి నమోవాకమ్ము లెల్లప్పుడున్.

ఈమజ్జీదుల దేవళమ్ములను తల్లీ ! నీవు ప్రేమించి యిం
దేమాలిన్యములేని స్నేహములతో నిన్నాళ్ళు పోషించిన
ట్లే మామాదులు హిందువుల్ గలిసి భాయీ! భాయి! బంధాలతో
ఈమాత్రు ఱితిలో జరింపవలెసుమ్మా ! రాజధాన్యగ్రణీ !

వహియింతువా క్షుధావహ్ని దగ్ధంబగు
సుకవిసంతతికి పోషకత నెఱప
సహియింతువా మనస్తాపమ్ము గల్గించు
డాబుదర్పంపు గూండాయిజమ్ము
దహియింతువా కిరాతక కార్యములు సేయు
నైచ్యజీవనుల పన్నాగశక్తి
రహియింతువా మహాబ్రహ్మండగోళాన
ప్రియమార శాంతిచంద్రికల బరపి

స్నేహసామరస్యజీవన మ్మొనరించు
నేక తాస్వభావమిచ్చి తొల్లి
నీసు తాళి బ్రతుకు భాసించువిధమున
బ్రతుకు నిప్పుడిమ్ము రాజధాని !

తెలుగుల దొడ్డసంస్కృతులు తీయని మేలిమితీరుతీయముల్
పలుకులలోని గౌరవపుభావము చక్కనిమన్ననల్ దిశాం
చలముల నాచికొన్నయవి సౌహృదయమ్ము వెలుంగనిమ్ము నీ
తెలుగులలోన నాంధ్రజగతీసతి ! ధర్మనిబద్ధభామతీ !

మధురమౌ నీదు వాఙ్మయమునుగని బ్రౌను
పండితుండు ప్రశంస వలికినాడు
అప్పయ్యదీక్షితుం డలరి నీభాషను
డెందాన నానందమొందినాడు
అబ్రమౌ నీపల్కు కిబ్రహీమ్ కుతుబుషా
చిత్తమ్ములో ఖుషి చెందినాడు
తిరుమలాంబ మగండు గుఱుతించి నీభాష
నేలి సత్కవుల పోషించినాడు

అందలాలనెక్కి యాహ్లాదతో యధీ
శ్వరుని తరగలందు స్నానమాడి
యెంత పొంగినావో ? యెవ్వ రూహింతురు
రసమనోజ్ఞవాణి ! రాజధాని !

నిరతంపు దుఃఖంపు తెరలలో పొరలాడు
నిఱుపేద పెదవిలో విరిసెనవ్వు
చితికిపోయినవారి జీవనసరళిలో
నవతరించెను దివ్యనవశకమ్ము
ఊషరక్షేత్రాల కూపిరి వోయంగ
పలుకరించెను నెఱా తెలుగుగంగ
చొరరానిభ[illegible]దంపు గిరిశిఖరాలలో
వినిపించె విజ్ఞానవేదఘోష

అభ్యుదయముకొఱకు పోరాటపడుచున్న
నవ్యదీక్షకులగు నందనులకు
తిరుగు లేదు నేడు తెలుగుదేశమ్ములో
రమ్యతా త్రివేణి ! రాజధాని !

గెలిచెన్ మానవతామహోదయము దిగ్దేశాలు కొండాడగా
నిలిచెన్ ధర్మము మేలిగుబ్బగొడుగై నీడల్ ప్రసాదింపగా
పిలిచెన్ కోటిగళాలతో నిట ప్రజావేశమ్ము పండింపగా
తెలుగున్ జాతి యికెట్లుగాంచెదొ నమస్తే! రాజధాన్యగ్రణీ !

29_10-1984.



# తెలుగుతల్లి

ధర్మధ్వజమ్ము మాధవవర్మ కాలాన
గగనాంగణములోన నెగురునాడు
తెలుగుయోద్ధల శౌర్యమొలక మల్లారెడ్డి
అరులసేనలను చెండాడునాడు
కులములంటని చాపకూటిసిద్ధాంతమ్ము
బ్రహ్మనాయం డేరుపరుచునాడు
పరిమళద్రవ్యసంపాదనాభాండారి
అవచితిప్పయ కీర్తినందునాడు

విపులభక్తి మెఱయ వీరకన్నమనీడు
స్వామివాక్పథాన సాగునాడు
సుతులలోన గలుగుశూరత్వమున కెంత
పులకరించినావొ తెలుగుతల్లి !

కొలపుబాపడు తొట్టతొలికవి నన్నయ్య
తెలుగులో కవనమ్ము గిలుకునాడు
దిష్టితగులకుండ తెనిగింప తిక్కన్న
జన్మమ్ము నిష్ఠమై సలుపునాడు

మధురశబ్దవిదుండు మహుండు శ్రీనాథుండు
కంచుఢంకను తన్నగలుగునాడు
ఘనుడు రాయలచేత గగ్గరన్ పెద్దన్న
కొలువులో తొడిగించుకొన్ననాడు

శాకపాకములను చక్కగా పోతన్న
వంటయింటిలోన వాణిచేత
నిండురుచులు దోప వండించుకొనునాడు
త్రేన్చినావుగదవె! తెలుగుతల్లి !

పతికి సాయముసేయ బవరాన మాంచాల
పంతాన ఖడ్గమ్ము వట్టునాడు
మగనిలో శౌర్యమ్ము రగిలించి చానమ్మ
అనితలానకు సాగనంపునాడు
కలహభూమిని విరోధులజీల్చి రుద్రమ్మ
తండ్రిపేరును నిల్పి తనరునాడు
పతిమృతి చెవిలోన బడినంత మల్లమ్మ
తమకాన నగ్నిలో దుముకునాడు

పౌరుషమున బ్రతుకు వీరాంగనలగన్న
భాగ్యశాలినివి ప్రపంచచరిత
కలిగినట్టి నీవు గర్వింపగాలు
వెలదిమిన్నలమ్మ ! తెలుగుతల్లి.

అభిరామహృదయుడౌ యిభరాము కుతుబుషా
తెలుగుగొప్పదనమ్ము నిలుపునాడు
ప్రముఖభాషావేత్త బ్రౌనువిద్వాంసుండు
తెలుగువాణికి గీర్తి దెచ్చునాడు
మురిసి రాజా రామమోహనరాయలు
తెలుగువైదికుల స్తుతించునాడు
ఎనలేని హర్షాబ్ధిమునిగి మెగస్తనీస్
తెలుగులయున్నతిన్ దెలుపునాడు

మెప్పుకొఱకుగాక యప్పయ్యదీక్షితు
లిజము లేని కంఠమెత్తి తెలుగు
బాస కేటికోళ్ళు పలికిన యానాడు
కులికిపోతివెగదె ! తెలుగుతల్లి !

కాలశతాంగచక్రగభీర గమనమ్ము
నల వీరబ్రహ్మమ్ము దెలుపునాడు
వర్ణకుడ్యాలను పడదన్న వేమన్న
కవితాయుధముతోడ కదలునాడు
విధవలౌవారికి వీరేశలింగమ్ము
తిరిగి వివాహమ్ము జరుపునాడు
కడుదీనమనుజులన్ గాపాడ బ్రహ్మర్షి
చిత్తశుద్ధిగ కృషి జేయునాడు

సంఘసంస్కరణము సాధింప గురుజాడ
శంఖమొత్తి దెసల జాటునాడు
అంతరమున నెంత హర్షమ్ము నందితో
దివ్యభావవల్లి ! తెలుగుతల్లి.

1-7-85.



# నారాయణ రెడ్డి

ఈ నవ్యోదయప్రక్రియప్రగతికిన్ హేరాళసాహిత్యని
ర్మాణానూన రసైకకల్పనలకున్ మంజూషమ్ముగానిల్చి యాం
ధ్రానన్ దొడ్డయశస్సునందిన కవీణ్మార్తాండుడై నట్టి శ్రీ
సి. నారాయణరెడ్డి కయ్యెడును రాశీభూతసౌభాగ్యముల్.

తప్పగు వ్యర్థశబ్దములధాటిని మార్కొని ద్వేషసాహితిన్
ద్రొప్పలలాడుభావముల దున్ని మహోన్నతభావనాపదా
లొప్ప రచించు రెడ్డి మధురోహలలో వెలిగ్రక్కు శబ్దపున్
గప్పురముల్ దిశాంచలము నాచికొనెన్ బుధు లుగ్గడింపగన్.

ఈ విశ్వంభర మెచ్చుకొన్నయది సాహిత్యప్రపంచమ్ములో
ఈ విశ్వంభర నిల్చిపోయినది రెడ్డీంద్రుండు ఘంటాన మే
ధావైదుష్యముజొన్ప సర్వమతసత్వంబైన సూత్రాలచే
నావిష్కారముసేయు రెడ్డికి శుభాలౌగాక యెల్లప్పుడున్.

ఎడదన్ సంస్కృతి దివ్యగంధము గమాయింపన్ పురాణించు ము
బ్బడిగా మానవతామహోజ్జ్వలమహాభావమ్ము స్వాంతాన నె
ప్పుడు మేల్చేయుటకే ప్రయత్నములు సల్పున్ సాహితీలోకచం
ద్రుడు రెడ్డీంద్రుడు నట్టిరెడ్డికగుతన్ పూర్ణాయురారోగ్యముల్.

తెలుగుల్ మెప్పులగాంచి గేయకవితాదీపాలు వెల్గించి జా
తిని నిద్రాణమునుండి మేలుకొలుప నుత్తేజమ్ము గల్గింపబూ
నిన సంస్కారగుణైకబంధువునకున్ శ్రీ సింగిరెడ్డ్యన్వయో
న్మణికిన్ రెడ్డికి ప్రోన్నతాశయునకున్ సంధిల్లు సుశ్రేయముల్.

తేనియలూరునట్లు గడిదేరిన వీణియమీటినట్లు కం
ఠాన సహస్రకోకిలలనాదము లొక్కటియైనయట్లు పొం
కాన పఠించువేళ తనకావ్యములన్ జగమంత తన్మయ
త్వానమునుంగు నిద్ది సుకృతంబగు రెడ్డికి ధీవివేకికిన్.

వాసినిగన్నయట్టి నిజవాసమునౌ హనుమాజిపేటలో
ఆ సిరిసిల్లలో జదివినట్టి పదేడుల బాలకుండు నే
డీ సకలోర్వరన్ పరచె నింపుదలిర్పగ మేల్ కవిత్వపున్
ఆసవ మట్టియోగ్యునకు నర్హములౌత సమస్తసత్కృతుల్.

తెలుగు నేలలోన కలకతా కేరళ
పొలములోన 'రషియ' భూమిలోన
బహుమతులనుగొన్న ప్రజ్ఞాధురీణుడౌ
సింగిరెడ్డికులుడు చెలగుగాక !

తనదైనట్టి యొకానొకందు రచనాతాత్పర్యమున్ గల్గి వ్రా
సిన సాహిత్యకళాబ్ధి కల్ల హనుమాజీపేట యబ్బాయికిన్
తెలుగున్ బాసకు పెద్దగా నిలిచి వన్నెల్ గూర్చు ధీశాలికిన్
మనసుంగల్గిన మానవోత్తమునకున్ రెడ్డీంద్రుకౌ సంపదల్.

హృదయముప్పొంగ నభ్యుదయసుకవితామ
హానల్పనగశిఖరాగ్ర మెక్కి
స్వేచ్ఛ రాణింప మాత్రాచ్ఛందమందు క్రొం
జాలులో వెలగేయాలు వ్రాసి
మహితసత్సభలలో మకరందమధురిమల్
జాలువారగ ప్రసంగాలుసేసి
మానవత్వమ్మును మంటలోగలుపు దా
ర్జన్యపద్ధతుల తిరస్కరించి

ప్రతిభగాంచి మెచ్చి పట్టమ్ముగట్టెను
ధీవసునకు మేల్మిభావుకునకు
దొడ్డగుణుడు సింగిరెడ్డి నారాయణ
రెడ్డి కగుత వసుధ పృథులయశము.

ముద్గలగోత్రసంభవుడు మోహనరూపుడు సాహితీలసత్
ప్రోద్గగనప్రదేశపరిరూఢవిహారుడు రెడ్డిమోదియై
యుద్గళమెత్తి కావ్యముల నుజ్జ్వలఫక్కి పఠించుచో సభా
చిద్గగనమ్ము తన్మయతజెందు విశేష మదెట్టిదోకదా !

నెమ్మి జామిచెట్టుకొమ్మల నీడలో
మధురకావ్యములను మలచి యొసగె
తెలుగులెల్ల మెచ్చ శ్రీలోకమణిభూష
బుచ్చిమాంబసుతుడు బుధవిధుండు.

10-10-1983.



రా జ ధా ని డా॥ యస్. ...





ఖస్సున త్రాచుపాములనగా గులమయ్యాలులేచి పట్టి ఛం
దస్సున గాటువేసెడి దినమ్మున, నీతడొకండు లెస్సగా
విస్సునలేచి తా పడగవిప్పి తదాకృతి నిల్చియుండె నం
తస్సముదారబుద్ధి పరితర్పితుడై కనకాభిషిక్తుడై.

20-10-1974 — విశ్వనాథ సత్యనారాయణ
విజయవాడ

మూల్యం : రు. 15-/లు రసజ్ఞపల్లి కేషన్సు, కాకినాడ-3.